# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా

ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206

web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com





Volume 28 Issue 7

No.of Pages 40

MARCH 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:

మేనేజరు

సమర్థసద్గురు మాగజైన్

శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,


**ఈ సంచికలో....** **పేజి**

# భద్రవాక్యం

**న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం**
**నేమా విద్యుతో భాంతి కుతోZయమగ్నిః**
**తమేవ భాంత మనుభాతి సర్వం**
**తస్య భాసా సర్వ మిదం విభాతి ॥**

అథర్వణ వేదీయ ద్వితీయ ముండకం ద్వితీయ ఖండం లోని ఈ పదకొండవ మంత్రం జ్యోతిస్సులకే జ్యోతిరూపమైన బ్రహ్మమును గురించి వర్ణిస్తున్నది. గురు సంప్రదాయంలో ఉన్నవారికి ఇది తమ గురుదేవుణ్ణి ఉద్దేశించి చెప్పిన మంత్రం అనిపిస్తుంది.

అక్కడ అంటే బ్రహ్మ విషయంలో సూర్యుడు ప్రకాశించడు. చంద్రుడు, తారలు, మెరుపు తీగలు కూడా ప్రకాశించవు. ఇక అగ్ని మాత్రం ఏ విధంగా ప్రకాశించగలదు? ఏ ప్రకాశం వలన మనకు వస్తు దర్శనం అవుతుందో ఆ ప్రకాశం అంతా ఆ బ్రహ్మముదే. స్వయం ప్రకాశమైన బ్రహ్మము యొక్క ఉనికి వలననే ఈ జగత్తు అంతా ప్రకాశమయంగా భాసిస్తున్నట్లు అనిపిస్తుంది. కాని నిజానికి ఆ ప్రకాశం జగత్తుది కాదు. అది బ్రహ్మముదే.

మామూలుగా ఒక కట్టె మరొక కట్టెను దహించలేదు. ఒక వత్తి ఇంకొక వత్తిని వెలిగించలేదు. అవి స్వయం ప్రకాశములు కావు. కాని బ్రహ్మము అగ్ని రూపంలో దాహక శక్తిని, తేజమును వాటికి ప్రసాదించినప్పుడు, ఒక కట్టె తాను ఎఱ్ఱగా కాలటమే కాక మరొక కట్టెను దహించగలుగుతుంది. ఒక వత్తి దీపంగా తాను వెలగటమేకాక మరొక దీపాన్ని వెలిగించగలుగుతుంది. సూర్య చంద్రులు, తారకలు, విద్యుల్లతలు కూడ అంతే. అవి స్వయంగా ప్రకాశించ లేవు. బ్రహ్మము యొక్క వెలుగు, తైక్ష్ణ్యము, చల్లదనం వలననే సూర్యుడికి తీక్షణంగా ప్రకాశించే శక్తి, చంద్రుడికి అమృతమయమైన చల్లని వెన్నెలలను కురిపించే శక్తి, తారలకు అలా మిణుకు మిణుకుమని ప్రకాశించే శక్తి, విద్యుల్లతకు అలా మెరిసే శక్తి, వారికి లోకాలకు వెలుగు, వేడిమి, చల్లదనం ఇచ్చే శక్తి కలిగాయి.

అలాగే తాము బ్రహ్మమే అన్న ఎఱుక నిరంతరం కలిగి ఉండే సద్గురుదేవులు తాము బ్రహ్మ స్వరూపులు, స్వయం తీర్థులై ఉండటమేకాక, తమను ఆశ్రయించిన వారికి వారు కూడ బ్రహ్మమే అన్న ఎఱుకను కలిగించి వారిని తరింపజేసే సామర్థ్యము కలిగి ఉంటారు. గురుదేవులను ఆశ్రయించిన వారు తరించటం కేవలం తమ సామర్థ్యం వలన కాదు. మోక్షమూలం గురోఃకృపా. *

# అమ్మ ఆశీస్సులు

**శంకరస్య చరితా కథామృతం**
**చంద్రశేఖర గుణానుకీర్తనం**
**నీలకంఠ తవ పాదసేవనం**
**సంభవంతు మమ జన్మజన్మని॥**

పరశివ స్వరూపులైన శ్రీసద్గురుదేవుల పరమ అనుగ్రహముతో మహాశివరాత్రిని ఎంతో ఆనందంతో జరుపుకున్నాము. మనము ప్రతిరాత్రిని దినమును మంగళప్రదముగా జరుపుకోవాలని మహాత్ములమాట.

అందుకనే శంకరుని చరితాకథామృతమును, చంద్రశేఖరుని గుణకీర్తనలను, నీలకంఠుని  పాదసేవనమును అంటే శ్రీసదాశివ స్వరూపులే అయిన శ్రీగురుదేవుని ముఖస్థుగా ప్రవహించిన పదముల సేవనము (**భజ్ సేవాయాం** అని) అట్టి సేవను నా జన్మజన్మలకు పొందుదునుగాక! అంటే నిరంతరము మహాత్ముల వాగమృతమును మనన నిదిధ్యాసనలతో అనుభవింతుము గాక!

దేహదృష్టిని రహితం చేసికొని అందున్న వాస్తవమైన నిజదృష్టిని గుర్తించితే దేహోదేవాలయఃప్రోక్తో జీవోదేవ స్సదాశివః (సనాతనః) దేహమే దేవునికి ఆలయము. అందున్న జీవుడు దైవమైన సదాశివుడే.

**నా దేహమే నీ దేవళం, నా జీవమే నీ ఆరాధనం** అన్న భావనతో మన ప్రతీశ్వాస శ్రీస్వామివారిదే అని గుర్తించితే, అదే నిజమైన శ్రీసదాశివుని ఆరాధన. అట్టి శక్తిని, భక్తిని శ్రీసద్గురుదేవులు మనకు ప్రసాదించెదరుగాక!!

- మీ అమ్మ

# సంపాదకీయం

అందరికీ ఉగాది సందర్భంగా మా హృదయపూర్వకనూతన సంవత్సర శుభాకాంక్షలు.

శ్రీకాళీ వనాశ్రమంలో శివరాత్రి మహా పర్వదినం పరశివ స్వరూపులైన శ్రీ సద్గురుదేవులకు బృందావనంలో నమక, చమక సహితంగా అభిషేకం, శ్రీరామలింగేశ్వర స్వామివారికి మహన్యాసపూర్వకంగా పంచామృతాలతో, నవరసాలతో, రుద్ర నమక, చమక పారాయణ, దశశాంతులు, పురుష, శ్రీసూక్త పఠనము మధ్య భక్తులచేత సహస్రఘటాభిషేకము, లక్షబిల్వార్చన, మహా ప్రసాదము, శ్రీమహాకాళికా పరమేశ్వరీ సహిత శ్రీరామలింగేశ్వరస్వామి దివ్య లీలా కళ్యాణ మహోత్సవము, అనంతరం ఆ ఆదిదంపతుల నగర పర్యటనోత్సవం వంటి క్షణంకూడా ఖాళీ లేని కార్యక్రమాలతో ఎంతో భక్తి భరిత వాతావరణంతో నిండిపోయింది.

ఈ నెల 27వ తేదీనుండి విరోధి నామ సంవత్సరం ప్రారంభం అవుతుంది. అంతవరకు సర్వధారి అని పిలుచుకుంటున్న కాలాన్నే ఆ రోజునుండి విరోధి అని పిలుచుకుంటాము. మార్పులులేని ఆత్మలో శరీరాలు అదృశ్యం అవుతూ తిరిగి కొంతకాలానికి కనుమరుగు అవుతున్నట్లే, భగవత్స్వరూపమైన కాలంలో (భగవానుడు గీతలో కాలో z స్మి అంటాడు) పగలు, రాత్రి, రోజులు, వారాలు, మాసాలు, ఋతువులు, అయనములు, సంవత్సరాలు వస్తూ పోతూ ఉంటాయి. విరోధి నామ సంవత్సరం అని పేరు విని మనం భయపడనవసరం లేదు. అంతటా తననూ, తనలో సర్వము దర్శించేవానికి విరోధులెవరుంటారు? జ్ఞాని నిర్భయుడు. సాక్షాత్తూ పరమాత్మ స్వరూపులే అయిన గురుదేవుల అభయము అనే ఛత్రాన్ని ధరించిన భక్తుడు కూడ నిర్భయుడు.

ఈ విరోధి నామ సంవత్సరంలో మనమందరమూ గురుకృపకు పాత్రులమై వారి అభయ హస్త కిరణాలలో నిర్భయులం కావాలని అటువంటి భక్తిని, శక్తిని గురుదేవులు మనకందరికి ప్రసాదించెదరుగాక అని హృత్పూర్వకంగా ప్రార్థిస్తూ

- గౌరవ సంపాదకుడు

## బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

సత్యభామ శమంతకమణితో తాను సంపాదించిన బంగారము, తన ఆభరణాలు, తన సర్వసంపదలు అన్నీవేసి తూచినా, అవి పరమాత్మకు సరి తూగ లేదు. తన సవతులెవరూ తనకు ఈ విషయంలో సహాయం చేయలేక పోయేసరికి సత్యభామ రుక్మిణిదేవిని ఆశ్రయించవలసి వచ్చింది.



రుక్మిణీదేవి త్రాసులో రెండోవైపు ఉన్న వస్తువులన్నీ తొలగింపజేసి, పరమాత్మకు భక్తి ప్రపత్తులతో నమస్కరించి, 'నా పతిదేవుని పట్ల నాకుగల దృష్టి సత్యదృష్టి అయితే ఈ పవిత్ర తులసీదళం స్వామితో తులతూగుగాక!' అని ప్రార్థించి, ఒక తులసీదళం తీసుకుని కళ్ళకద్దుకుని, స్వామి పాదాలకు తాకించి, త్రాసులో రెండోవైపు ఉంచింది.

త్రాసు తులసీదళం వైపు మొగ్గు చూపింది. అహంకార దృష్టికి స్వామి ఎప్పుడూ అందడు. భక్తి ప్రపత్తులతో ఆయనను స్మరించుకుంటే అహంకారమనే గుణం తొలగిపోతుంది.

వసుదేవుడు అలా భక్తి ప్రపత్తులతో స్వామికి నమస్కరించి తట్టను తన తలపైకి ఎత్తుకున్నందు వలన అది ఆయనకు దూదిపింజ కంటె తేలికగా అనిపించింది. చెరసాల బయటకు వచ్చేసరికి వర్షం జోరుగా కురుస్తోంది. వరుణదేవుడు కూడా స్వామిని ఆ లీలావతారంలో బాలునిగా దర్శించటానికి ఉబలాటపడ్డాడు. స్వామిపై వానపడకుండా ఆదిశేషుడు తన పడగలను భద్రంగా పట్టి వసుదేవుని వెనకాలే నడిచాడు. వరద వచ్చి పొంగుతున్న యమునానది ఆ భక్తవరదుని చిరుపాదాలని తాకి రెండుపాయలుగా చీలి వసుదేవునికి త్రోవ ఇచ్చింది. యమున దాటి వ్రేపల్లెలో నందుని ఇంటికి చేరాడు వసుదేవుడు. వ్రేపల్లెలో అందరూ గాఢ నిద్రలో మునిగి ఉన్నారు. వసుదేవుడు తన చేతిలో ఉన్న శిశువును యశోదమ్మ ప్రక్కలో పడుకోబెట్టి ఆమె ప్రక్కలో ఆడ శిశువు రూపంలో ఉన్న యోగమాయను తీసికొని తిరిగి చెరసాలకు వచ్చేశాడు.

వ్రేపల్లెలో స్వామి దివ్యపాదారవిందాలను మొదటగా దర్శించింది రాధ. ఆ దివ్య దర్శనం వలన ఆమెను ఆవరించిన అజ్ఞాన మేఘములు తొలగి పోయినవి. నారాయణుని సత్యరూపం దర్శనమైనది. 'నా జన్మాంతర సుకృతం నేటికి ఫలించింది. ఇక క్షణమైనా ఈ పాదములను వదలక నా హృదయ మందిరంలో నిలుపుకుంటాను' అని ఆమె నిర్ణయించుకున్నది. అనుక్షణమూ కృష్ణ ధ్యానంలో తన్మయత్వాన్ని పొంది సర్వస్వమూ మరచిపోయింది. లోకులు ఎన్నో అన్నారు. అత్తమామలు ఎంతో హింసించారు. అయినా ఆమె చలించలేదు. సముద్రము లోతు తెలుసుకోవాలని అందులో మునిగిన ఉప్పు బొమ్మ సముద్రములోనే కరిగి లయించిపోయినట్లు రాధ ఆ కృష్ణ తత్త్వములో సంపూర్ణముగా లీనమైపోయింది. ఆ మధురాధినాథుని మనస్సులో నిలుపుకున్న ఆమెకు తన చుట్టూ ఉన్న సర్వస్వమూ ఆయన రూపంగానే మధురంగా తోచింది.

యమునాతటిపై స్వామి జగన్మోహనాకారుడై నిలబడి వేణుగానం చేస్తుంటే, యమునలోని జలం పొంగివచ్చి, ఆ దివ్యనాథుని చరణారవిందాలను తాకింది. తత్ఫలితంగా ఆ యమున నీరు అప్పటి నుంచీ తీయగా, మధురంగా మారిపోయింది. ఆ నీల మేఘశ్యాముని చరణాబ్జాలను సోకినప్పటి నుండి యమున నీటి రంగు నీలంగా మారి యమున కూడా కృష్ణరూపాన్నే ధరించింది. యమునానది ఇప్పటికీ ఎంతో పవిత్రంగా భావించబడుతున్నది. అందులో స్నానం చేస్తే సమస్త పాపములూ హరించిపోతాయి. అది ఆ నది గొప్పతనమా? కాదు. స్వామి దానిలో స్నానం చేసేవారు కనుక ఆ నీటికి ఆ మహిమ వచ్చింది. ఆయన చరణరజము సోకిన యమునా తటిపై ఇసుక కూడా పంచదార కంటె మధురంగా ఉండేది. సర్వమూ కృష్ణమయంగా భావించిన రాధ, ఆ ప్రభువు పాదముద్ర పడినచోట తన నాలుకతో తాకింది. ఆహా! మధురాతి మధురం! ఇసుక తీయగా ఉండటమేమిటి అని హేతువాదులు అనవచ్చు. ఆ మాధుర్యమేమిటో భక్తునికి, భగవానునికే తెలుసు కానీ, కపట భక్తునికేం తెలుస్తుంది? తన ఒడిలోని పసిపిల్లవాడు చీమిడికారే ముక్కుతో, పుసులు కట్టిన కళ్ళతో ఎలా ఉన్నా, వాడిని నఖశిఖ పర్యంతం ముద్దులతో నింపి వేస్తుంది ఆ తల్లి! ఆ లాలనలోని మాధుర్యం, ఆ శిశువుకు, ఆ కన్నతల్లికే తెలుస్తుంది కానీ, గొడ్రాలికేం తెలుస్తుంది?

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

మన సాధనలో ఎన్ని పరీక్షలు వచ్చినా 'నేను నా శక్తి చేత' వీటిని ఎదుర్కోగలను అని అనుకుంటే కుమారస్వామికి జరిగినట్టే జరుగుతుంది. అలా కాకుండా, సమస్య లెదురైనప్పుడు వినయ భయభక్తులతో "ప్రభూ! ఇది నా శక్తి వల్ల జరిగే పనికాదు. ఈ సంకట స్థితి నుండి నన్ను ఏ విధంగా ఆదుకుంటారో మీ దయ" అని గురుమూర్తిని శరణు వేడితే, ఆయనే మనరక్షణ బాధ్యతని వహిస్తారు. గణపతి తన తండ్రియైన పరమశివుడినే తన గురువుగా భావించి శరణుకోరాడు. అప్పుడు పరమేశ్వరుడు "శివస్యహృదయగ్ం విష్ణుః। విష్ణోశ్చ హృదయగ్ం శివః" అన్నట్టు, నాయనా! "సకృన్నారాయణేత్యుక్త్వా పుమాన్। కల్పశతత్రయం గంగాది సర్వ తీర్థేషు స్నాతోభవతి పుత్రక।" కనుక, నువ్వు 'ఓం నమోనారాయణాయ' అనే అష్టాక్షరీ



మహామంత్రాన్ని ముమ్మారు జపిస్తే నీకు మూడులోకాలు ప్రదక్షణ చేసిన ఫలితం వస్తుంది అని చెప్తారు. అప్పుడు గజాననుడు, తండ్రిగారికి ఇష్టమైన సేవ చేసుకోవాలనుకుని, వారు ఆదేశించిన విధంగా నారాయణ మంత్రాన్ని జపించడమేకాక, ఏడేడు పదునాలుగు భువన భాండాలని భరించే సకల లోకైక భర్త అయిన తన తండ్రిగారికి, అఖిలాండేశ్వరి అయిన తల్లిగారికి కలిపి ముమ్మారు ప్రదక్షిణం కూడా చేసి, ఆనందంగా వారి పాదాల చెంత కూర్చుంటాడు. సర్వవ్యాపకుడైన నా ప్రభువుకి ప్రదక్షిణ చేస్తున్నాను అని అనుభవించి చేశాడు. మనం కూడా అలా నమ్మితే, సమస్త తీర్థాలు ఇక్కడే, గురుపాద సన్నిధిలోనే వున్నాయి. పాపం అక్కడ షణ్ముఖుడు ఏ తీర్థానికి వెళ్ళి స్నానం చేసి వస్తున్నా, తనకంటే ముందు తన అన్నగారు స్నానం చేసి ఒళ్ళు తుడుచుకుంటూ కనిపిస్తాడు! మూడు లోకాల తీర్థాలలోనూ మునిగి మునిగి అలసిపోయి చిట్టచివరికి కైలాసానికి చేరుకునేసరికి అక్కడ గణపతి

తల్లిదండ్రులని సేవించుకుంటూ కనబడతాడు మన కుమారస్వామికి! తన స్వశక్తి వలన ఏదైనా సాధించగలననే అహంకారం సాధకుడైన వాడికి ఉండకూడదు. సాధన చేయాల్సింది తానే అయినా, అనంతమైన గురుశక్తికి తలవంచి శరణువేడితే తాను సాధించలేని కార్యమేమీ ఉండదు అని ఈ ఇతిహాసం మనకి బోధ చేస్తున్నది. సాంబశివుడు కుమారస్వామికి కూడా ఏమీ తక్కువ చేయలేదు. ఆయనకి దేవసేనాధిపత్యాన్ని ప్రసాదించాడు.

ఇప్పుడు మన గజాననుడికి గణాధిపత్యం వచ్చి గణపతి అయ్యాడు. మరి ఆయనకి సమస్త దేవతలు, గణాలు, మానవులూ అందరూ ఆనందోత్సాహాలతో పూజలు చేసి, ఉండ్రాళ్ళూ, కుడుములు, మోదకాలు, అనేక ఫలాలు నివేదన చేశారు. "వీరు నా విగ్రహాన్ని బంగారంతో చేశారు కాబట్టి వారు పెట్టినవి తింటాను - ఫలానా వారు విగ్రహాన్ని మట్టితో చేశారు కాబట్టి వారు పెట్టినవి తినను'' అని అనుకోలేదాయన. ఈ ఫలహారాలు బావున్నాయి, అవి బాగుండలేదు అని ఇష్టాయిష్టాలు కూడా లేవాయనకి. అందరినీ తృప్తి పరచాలి, అందరినీ ఆనందింపచేయాలి అనుకున్నాడు. ఎవరేది పెడితే అన్నిటినీ స్వీకరించాడు. ఆయన బొజ్జంతా ఈ ప్రసాదాలతో నిండిపోయింది. తనకి ఇంతటి మహత్తరస్థితిని ప్రసాదించిన తన తల్లిదండ్రులకి కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరిద్దామని సాష్టాంగపడ్డాడు. పొట్టనిండుగా ఉండడంతో, చేతులు జగన్మాతాపితరుల పాదాల కానిస్తే, మన గణపతి కాళ్ళు పైకి లేవడం మొదలుపెట్టాయి కాళ్ళు అనిస్తే, చేతులు లేచిపోయాయి. అయినా ఆయన తన ప్రయత్నాన్ని మానకుండా ఎలాగో ఒకలాగ సాష్టాంగ నమస్కారం చేయడానికి నానా తంటాలు పడుతున్నాడు. మనమయితే మన అవస్థని అందరూ చూస్తారని, ఏదో పెట్టీ పెట్టనట్టుగా నమస్కారం చేసేసి వెళ్ళిపోతాం. కేవలం గురుభావము, కృతజ్ఞాతా భావమే తప్ప, ఆయనలో ఎక్కడైనా దేహాభిమానమనేది ఉంటేకదా!

గణపతి పడుతున్న అవస్థను చూసి, పరమశివుని జటాజూటంపై ప్రకాశిస్తున్న చంద్రుడు నవ్వాడు. ఎంతటి ఉన్నత స్థితిలో ఉన్నా, ఎంత గురుసాన్నిధ్యంలోనే ఉండి ఎంత సన్నిహితంగా సేవ చేసుకుంటున్నా, ఇటువంటి నీచదృష్టి, దేహదృష్టి వుంటే ఏంలాభం? 'నేను పైనున్నాను' అని విర్రవీగితే శాపాలకి గురవుతారు.

-సశేషం

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

కబీర్‌దాస్ భార్య విసేరిసిన విస్తళ్ళని నడుముకు చుట్టుకొని తన మానాన్ని కాపాడుకొనేది. మహాత్ములు శరీరానికి ఎంత విలువనిస్తారో గ్రహించారా! కాని మానవుడు ఎన్నో వికారాలతో కూడిన శరీరాన్ని నమ్ముకుంటాడు. నిత్యమని భ్రమిస్తాడు. వెధవ ఒక్క రూపాయి దొరికితేనే దానిని ఎంతో జాగ్రత్తగా కాపాడుకొంటాడే మరి నిత్యమైన పరమాత్మ వస్తువుని ఎంత జాగ్రత్తగా కాపాడుకోవాలి? కబీర్‌దాస్ భక్తుల ఆరాధన కోసం తన భార్య మానాన్ని కూడా లక్ష్యపెట్టలేదు. కబీర్‌దాస్ ధనం అవసరం వచ్చి ఒక షావుకారు వద్దకు వెళ్ళాడు. ఆ షావుకారు కబీర్‌దాస్ భార్యతో కామాన్ని వాంఛిస్తాడు. భక్త ఆరాధన కోసం భార్య ప్రోద్భలం చేత కబీర్‌దాస్ అంగీకరించక తప్పలేదు.

కబీర్‌దాస్ భార్య షావుకారు దగ్గరకు వెళ్ళి ఒక్కసారి ప్రభూ! అని ప్రార్థించేసరికి రామోజీ, లక్ష్మోజీ అనే ఇరువురు వ్యక్తులు డి.యస్.పి. పోలీస్ ఇన్‌స్పెక్టర్ వేషాలలో వచ్చి షావుకారు తలుపు తట్టారు. మరి జితేంద్రియుడు ఊరుకుంటాడా! పోలీసు కానిస్టేబుల్ వేషంలో తయారయ్యాడు. ఆ వచ్చిన పెద్దమనుషులకు తలుపు తీయవలసిన అవసరం ఏముంది? తలుపులు అవే తెరచుకున్నాయి. వీరిని చూసేసరికి షావుకారుకు ప్రాణం పోయినంత పనైంది. షావుకారు తాను చేసిన పనికి పశ్చాత్తాపపడి కబీర్‌దాస్ భార్య పాదాలపై పడి జ్ఞానభిక్ష పెట్టమని వేడుకుంటాడు. ఆవిడ పాదస్పర్శతో షావుకారుకి వివేకం కలిగింది. అనుకోకుండా రామోజీ, లక్ష్మోజీల దర్శనం కలిగింది.

అటువంటి భక్తి ధనాన్ని ఆర్జించాలి. అది లభించాలంటే గురువు ఆజ్ఞాపాలన, గురునామ స్మరణ, గురువుయందు విశ్వాసం కలిగి ఉండాలి. విశ్వాసం పెంపొందించుకున్న కొద్దీ నారికేళంలో నీరు హరించి పువ్వు పెరిగినట్లు నీలో భక్తి పెంపొందుతుంది. విశ్వాసం ఏ మాత్రం సడలినా ఏనుగు మింగిన వెలగపండు మాదిరి పండు పండుగానే ఉంటుంది కాని, లోపల ఏమీ ఉండదు.

చతుర్విధ శుశ్రూష అంటే ఏ విధంగా చేయాలో మీ కందరికీ అర్థమయ్యేలాగా ఒక ఉదాహరణ చెబుతాను. మీకందరికీ అనుభవంలో ఉన్నదే. మీకు కొత్తగా వివాహం అయిన రోజుల్లో మీరు ఏ పనిలో ఉన్నా, మీ భావనలో ఎవరు నిలిచేవారు? మీరు వెంటనే మీ పనులు ముగించుకొని మీ భార్యను చేరాలని తపించేవారు కదా! ఇది మీ కందరికీ అనుభవమే కదా! అటువంటి

దృష్టి, ఆవేదన పరమాత్మపై కలగాలి. మీ శుశ్రూష అంత తీవ్రంగా ఉండాలి. అప్పుడు మీకు లోటు ఏముంటుంది? అన్నారు. ఇంతలో మూర్తీజీ లేచి, వెళ్ళాలి బాబూ! హాస్పేట వెళ్ళాలి అన్నారు. రేపు వెళ్ళకూడదా అని శ్రీబాబు అడిగారు. ఈరోజు తప్పనిసరిగా వెళ్ళాలి బాబూ! అన్నారు మూర్తీజి. అయితే సడెన్‌గా మోషన్స్ అయ్యాయి అనుకో ఎం చేస్తావు? వెళ్ళి అనవసరంగా బాధపడటం ఎందుకు? ఆలోచించుకో అన్నారు శ్రీబాబు నవ్వుతూ. శ్రీబాబు సూచన అర్థం చేసికొన్న మూర్తీజీ ప్రయాణాన్ని వాయిదా వేశారు.

**24-2-1985**

నిన్నటిరోజు మధ్యాహ్నం బాబు అమెరికా నుంచి మద్రాసు వచ్చి అక్కడ నుండి బయలుదేరి రాత్రికి తిరుపతి చేరుకున్నారు. భక్తులంతా ఆయన్ని దర్శించారు. ఈ రోజు ఉదయం శ్రీబాబు భక్తులకు పునర్దర్శనం ఇచ్చారు. శ్రీబాబు భక్తులనుద్దేశించి మాట్లాడుతూ 'మిమ్మల్నందరినీ చూద్దామని ఎంతకాలంనుంచో అనుకుంటున్నాను. నాకు చాలా సంతోషంగా ఉంది. మీలో ఎవరైనా వ్యవహారాలుగాని, ప్రాపంచికమైన కోరికలుగాని మనస్సులో పెట్టుకొని నా కోసం నిరీక్షిస్తుంటే వారంతా వెంటనే వెళ్ళిపొండి. ఇంతకాలం దానికోసమే నా జీవితకాలమంతా వృథా చేశాను. అందువలనే ఇలా అయింది. మీరు భగవంతుడి గురించి మాట్లాడదలచుకుంటే మాత్రం కూర్చోండి. నాకు ఏ మాత్రం అభ్యంతరం లేదు. మీతో ఎంతసేపైనా మాట్లాడతాను' అన్నారు. ఇంతలో ప్రసాదరావుగారు మాట్లాడుతూ 'నేను తమరిచ్చిన డైరీలో శతకం వ్రాశాను బాబూ' అన్నారు. శ్రీబాబు మాట్లాడుతూ 'మీరు వ్రాసిన శతకానికి కృతజ్ఞతలు. చాలా సంతోషం. మీరు పంపిన పుస్తకం అందినది' అన్నారు. శ్రీబాబు ఇంకా మాట్లాడుతూ 'మీకు ఒక విషయం చెబుతాను వినండి. నేను చెప్పానని మీరు ఏమీ అనుకోకండి. చెప్పటం నా ధర్మం కాబట్టి నేను చెబుతున్నాను. అందులో మంచి ఉంటే తీసికోండి, లేకపోతే మాకే వదిలివేయండి. మేము లెక్చరర్స్, ప్రిన్స్‌పాల్స్ మమ్మల్ని ఇంత మాట అంటారా? అని బాధపడకండి. నేను మిమ్మల్ని బాధపెడదామనే ఉద్దేశంతో అనను. మిమ్మల్ని మంచి మార్గంలో పెడదామనే ఉద్దేశంతో చెబుతాను. మీరు వ్రాసిన శతకానికి ధన్యవాదాలు. కానీ మీరు చేసే రచనలో కవిత్వంకాని, భాషకాని, మరి ఏ ఇతరమైనవికాని ఏ రకంగా ఉండాలి? అవి మీకు అనుభవాన్ని ఇచ్చి ఉండాలి. తద్వారా మీరు ఉపకారం పొంది, అది ఇతరులకు ఉపయోగపడేలాగా ఉండాలి. అంతేకాని అది కేవలం పాండిత్యంతో కూడిన రచన అయితే ఎంత కాలం నిలుస్తుంది? - సశేషం

## శ్రీగీతా సూత్ర రత్నమాల

(గత సంచిక తరువాయి) -శ్రీ యోగేశ్వరానంద స్వామి

**47. దైత్యానాం ప్రహ్లాదః కలయాతాం కాలో మృగాణాం మృగేన్ద్రః పక్షిణాం వైనతేయ స్సర్గాణా మాదిరంతశ్చ మధ్యం చ విద్యానా మధ్యాత్మవిద్యా ప్రవదతాం వాదోఽక్షరాణామకారో నారీణాం శ్రీ కీర్తిశ్చ వాక్చ స్మృతిర్మేధాధృతిః క్షమా ఛలయతాం ద్యూతం తేజస్వినాం తేజస్సత్త్వవతాం సత్త్వం గుహ్యానాం మౌనం భూతానాం బీజమితి సర్వం తదేవ.**

దైత్యులలో ప్రహ్లాదుడును, వశీకరణ శక్తులలో కాలమును, మృగములలో సింహమును, పక్షులలో గరుడును, సృష్టిలో ఆదిమధ్యావసానములును, విద్యలలో ఆధ్యాత్మమును, వాదజల్ప వితండములలో వాదమును, అక్షరములలో అకారమును, స్త్రీ గణమున ధర్ముని భార్యలగు శ్రీ, కీర్తి, వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమములను, మోసములలో జూదమును, తేజస్వి పురుషులలో తేజస్సును, సాత్త్వికులలో సత్త్వగుణమును, గుహ్యములలో మౌనమును, భూతసృష్టికి మూలమగు బీజమును, ఈరీతిగా సర్వశ్రేష్ఠ పదార్థములను సర్వమును భగవంతుడే యని ధ్యానింపనగును.

**48. చరాచర మేకాంశేన స్థితో జగత్.**

చరాచర రూపమగు ఈ జగత్తు అంతయును ఈశ్వరుని యేకాంశము వలననే స్థితిని బొంది నిలిచియున్నది.

**49. సహస్రశీర్షా సహస్రాక్షః సహస్రపాద్విశ్వతో ముఖ స్తదేవ.**

సహస్ర శీర్షుడనియు, సహస్రాక్షుడనియు, సహస్రపాత్తనియు, విశ్వతోముఖుడని వేదసూక్తమున వర్ణింపబడిన పురుషుడు ఈశ్వరుడే.

**50. సర్వభూతేషు నిర్వైర స్తద్రూపం పశ్యతి.**

ఎవరితోడను శత్రుత్వములేక సర్వజీవులను సమముగ ప్రేమించువాడే ఆ ఈశ్వరరూపమును దర్శన మొనర్పగలడు. ఇదియే భక్తుని లక్షణము.

**51. అవ్యక్తాసక్త చేతసాం క్లేశో ఽధికరతరా.**

నిర్గుణోపాసన మొనర్చుట అందరికీ సాధ్యముకాదు. అది చాలా ప్రయాసతో కూడినది. ఇది జ్ఞానమార్గము.

-సశేషం

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

డిశంబరు 9నుంచి 11 వరకు జరిగిన శ్రీశ్రీశ్రీ సద్గురు గీతా యజ్ఞంలో 9వ తేదీన పరమహంస పరివ్రాజక పరమపూజ్య శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామి వారు అందించిన బోధామృత సారాంశం పాఠకుల సౌకర్యంకోసం ప్రచురిస్తున్నాము
-ఎడిటర్

పరమపునీతమైన పీఠాన్ని అలంకరించిన శ్రీకాళీవనాశ్రమ వ్యవస్థాపకులు శ్రీశ్రీశ్రీకాళీవర ప్రసాద బాబూజీ మహరాజ్ వారికి, శ్రీకాళీవనాశ్రమ పీఠాధిపతి యోగిని శ్రీ చంద్ర కాళీ ప్రసాద మాతాజీ వారికి, మీ అందరిలో ప్రకాశిస్తున్న పరమాత్మునికి ప్రణామాలాచరిస్తూ...

మానవునికి మూడు దినాలున్నాయి -సుదినం, దుర్దినం, తద్దినం అని. పరమ పుణ్య పురుషులకు మాత్రమే సుదినం వస్తుంది. అమ్మగారు ఈ గీతాయజ్ఞ కార్యక్రమం పెట్టారు. మనకు దేహాలు మూడు. అవస్థలు మూడు. గుణాలు మూడు. ఈ మూడులోనే చిత్ర విచిత్రమైన జగత్తు ఉంది. మూడు దేహాలకు విలక్షణుడైనవాడు సాక్షాత్ భగవంతుడవుతాడు. మానవుడు బ్రతికినంతకాలము పాటొనర్చు పొట్టకూటికై, కాని మనం వినాల్సింది,లౌకిక విషయాలు కాదు. అలౌకిక విషయాలు ఎవడు వింటాడో వాడికిది కడసారి జన్మ. ప్రతినిత్యం, ప్రతిక్షణం ఈవిధంగా కాలాన్ని సద్వినియోగం చేసుకుంటే ధన్యులౌతారు. గీతాయజ్ఞానికి నిన్న అంకురారోపణం జరిగింది. అంకురారోపణ నీ హృదయంలో కావాలి. మాతాజీవారు తెల్లవారుజామునుంచి ఎడతెరిపి లేకుండా యజ్ఞ కార్యక్రమాలు చేయిస్తున్నారు, సంకీర్తన చేశారు. ఇప్పుడు మొదటి సత్సంగ సమావేశానికి శుభారంభం చేశారు. ఇది ఏ శక్తి? గురు శక్తి, **మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం** - గురుకృపచేత సాధ్యం కానిది ఏమి ఉన్నది? గురువు అంటే సృష్టి చేసే బ్రహ్మ కాదు పరబ్రహ్మ. బ్రహ్మ, విష్ణు మహేశ్వరులవి వేరే డిపార్ట్‌మెంటులు. ఏ ఒకరి డిపార్టుమెంటు ఇంకొకరు చేయరు. గురువు తనను ఆశ్రయించిన అంతేవాసులకు వేయి సార్లు గురుబ్రహ్మ రూపంలో బ్రహ్మ జిజ్ఞాస సృష్టించి అది భగ్నం కాకుండా విష్ణు స్వరూపంలో రక్షిస్తాడు.గతంలో ఉన్న వాసనా సంపుటిని రుద్ర రూపంలో విలయం చేస్తాడు. పరబ్రహ్మ స్థితి

**పతిహీనా యథా నారీ మాతృహీనో యథా శిశుః**
**గురుహీన స్తథా ప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్ ॥**

అంటాడు పరమేశ్వరుడు పార్వతితో (గురుగీత). లోకంలో ముగ్గురు నిరర్థకులు.

భర్తలేని స్త్రీ -భర్త లేకపోతే ఆమెను లోకం హీనంగా చూస్తుంది.

తల్లి అనుగ్రహానికి నోచుకోనివాడు - ఆ బిడ్డ జీవితం వృథా.

గురుదేవుల అనుగ్రహం పొందలేనివాడు వాని జీవితం వృథా.

అన్నిటికంటే పాపం ఏమిటి అంటే దొంగతనం అంటారు. కాని దేహాత్మబుద్ధి ఉందే అదే అన్నిటికన్న హీనమైన పాపం. గురుదేవుడు హస్త మస్తక సంయోగంచేత **'అయమాత్మా బ్రహ్మ', 'ప్రజ్ఞానం బ్రహ్మ'** అని ఉపదేశించగానే దేహాత్మబుద్ధి పటాపంచలౌతుంది. మానవుడై పుట్టి గురుదేవుని ఆశ్రయించనివాని జన్మ వృథా. లౌకికవిద్యలకేగురువు అవసరం అయితే అలౌకికమైనదానికి గురువు ఇంకాఎంత అవసరం!

మలము, విక్షేపము, ఆవరణము అనే దోషత్రయాలు ప్రతిజీవికి ఉన్నాయి. ఈ దోషం ఉన్నవాడు మంచిని దర్శించలేడు. మంచిచోటుకు వెళ్ళలేడు. వారు శాస్త్ర నిషిద్ధ కర్మలను ఆచరిస్తారు. ఈ దోషాలను పోగొట్టుకొన్నవాడు మహాత్ముల కటాక్షానికి పాత్రుడవుతాడు. మహాత్ములు మనకు ఇది ధర్మం, ఇది అధర్మం అని తెలియజేస్తారు.

మలదోషం - కృష్ణుడు ఒకసారి దుర్యోధనుని దగ్గరకు వచ్చి పాండవులకు అర్ధరాజ్యం అక్కరలేదు అయిదు ఊళ్ళు ఇస్తే చాలు అంటే దుర్యోధనుడు "నాకుధర్మం తెలుసు, అధర్మం తెలుసు. కాని ధర్మాన్ని పట్టుకోలేకపోతున్నాను, అధర్మాన్ని వదలలేకపోతున్నాను'' అంటాడు." అయితే నీ ఖర్మ పో'' అంటాడు కృష్ణుడు. ఈ యజ్ఞ యాగాలు ఎందుకు పెట్టారు? అవి చూడటానికి పుణ్యం చేసి ఉండాలి.

విక్షేపం - వాక్కు చేసే దోషం. తినరాని పదార్థాలు తినటం, కొండెములు చెప్పటం. మహాత్ముల బోధ వింటున్నా విక్షేపదోషం ఉన్నవారి మనస్సు బజారువైపు పరుగులుతీస్తుంది. దానిని వశం చేసికొవాలంటే భగవన్నామస్మరణ చేయాలి.

అందుకే అమ్మగారు ప్రొద్దుటనుంచి భగవన్నామం చేస్తూ, అందరిచేత చేయిస్తూ అందరికీ భగవన్నామంపై ఆసక్తిని కలిగిస్తున్నారు.

- సశేషం

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

శ్రీచంద్రభాగ నది ఒడ్డున పండరిపురంలోనీ దామాశెట్టి గోణాబాయి పుణ్యదంపతుల భాగ్యం పండింది. సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు అంశతో జన్మించిన జ్ఞానదేవుల వారికి ఆనంద సమాధిని కలిగించటానికి, నిర్గుణ ప్రధానమైన జ్ఞానదేవుల భక్తిమార్గంతోపాటు నాథ్ సంప్రదాయ ప్రధానోద్దేశ్యమైన సగుణ సాకార భక్తి, నామ సంకీర్తన అనే ఝుంఝూ మారుతంలా వీచిఅందరి హృదయాలలో జాతి, మత, కుల, వర్గ, వర్ణాతీతమైన ఈశ్వరభక్తిని సుప్రతిష్ఠితం చేయటానికి సనత్కుమారుడు నామదేవుడుగా ఆ పుణ్యదంపతులకు జన్మించాడు.

పాండురంగడే జనాబాయి అనే ఒక అనాథ బాలను కూడా ఆ దంపతుల జోలెలో వేశాడు. జనాబాయి కులం ఏమిటో ఎవరికీ తెలియదు. ఆమెను అందరూ ఒక శూద్ర బాలికగానే చూశారు. జనాబాయి దామాశెట్టి ఇంట్లో వారి కుటుంబ సభ్యులతో కలిసిపోయి, ఆ ఇంటి పనులన్నీ పైన వేసికొనిచేసే ఒక దాసిగా భావించుకుని అలాగే పెరిగింది. జనాబాయి భావనలో నామదేవుడు సాక్షాత్తూ పాండురంగడే. తాను ఆ పాండురంగడి నీడ. పాద దాసి. నామదేవుడికి జని సాక్షాత్తూ జగజ్జనని అయిన రుక్మాబాయి అవతారం.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. నామదేవుడికి చిన్నతనం నుంచే బడి అన్నా, అక్కడ నేర్పే పొట్టకూటి చదువు అన్నా ఇష్టం ఉండేది కాదు. అతడికి ఎప్పుడూ విఠలుడితో ఉండటం ఇష్టం. ఆ విఠలుడితో మాట్లాడుకోవటం, ఆడుకోవటం, అంటే చాలు ఇక తిండి తిప్పలు కూడ గుర్తుండవు.

దామాశెట్టి గుళ్ళో పాండురంగడికి నైవేద్యం పెట్టి ఆ ప్రసాదం ఇంటికి తెస్తే, అప్పుడు ఆ ఇంట్లో వాళ్ళందరూ భోజనం చేయటం అలవాటు. ఒకసారి దామాశెట్టి పొరుగూరు వెళ్ళారు. పాండురంగడికి నైవేద్యం పెట్టటానికి ప్రసాదం గుడికి తీసికెళ్ళాలి. నామదేవుడి అక్క ఆఉబాయి తిరిగి తిరిగి చివరకు బడి ఎగగొట్టి చంద్రభాగ ఇసుక తిన్నెలలో విఠలుడితో ఆడుకోవటానికి వెళ్ళిన నామదేవుణ్ణి పట్టుకుని ఇంటికి తెచ్చింది. తల్లి వంట పూర్తిచేసి నైవేద్యం పళ్ళెం నామదేవుడికిచ్చి పాండురంగడికి ఆరగింపుచేసి రమ్మని గుడికి పంపుతుంది. గుళ్ళో విఠలుడి ముందు నిలబడితే వీడికి ఒళ్ళు తెలియదు, పాండురంగడికి

నైవేద్యం పెట్టించి నామదేవుణ్ణి త్వరగా ఇంటికి తీసికొని రమ్మని జనిని కూడ వెంట పంపింది.

ప్రసాదంతో నిండుగా ఉన్న పళ్ళెం చూసి నామదేవుడు జనాబాయితో 'జనీ! ఈ పళ్ళెం విఠలుడి ముందు పెట్టి, అలా ఊరికే వాడికి చెయ్యి చూపించి, ప్రసాదం అని పేరుపెట్టి, తిరిగి తెచ్చుకొని పళ్ళెం అంతా మనమే ఖాళీ చేయటం ఏమీ బాగాలేదే. ఇవ్వాళ ఎంత ప్రొద్దుపోయినా సరే, పాండురంగడు ఈ ప్రసాదం స్వీకరించనిదే నేను ఇంటికి రాను. భోజనం చేయను. ఒకవేళ నీకు ఆకలి అయితే ఇంటికి వెళ్ళి, మీరు ముగ్గురూ భోజనం చెయ్యండి' అన్నాడు. 'నామా! నీవు భోజనం చేయకపోతే నాకు ముద్ద గొంతు దిగుతుందా. నీవు గుళ్ళో నుంచి బయటకు వచ్చేదాక నేను నీ కోసం మెట్ల మీదనే కాచుకొని కూర్చుంటాను, మొన్న పొరపాటున లోపలికి అడుగు పెట్టానని, పూజారి వీపు మీద గట్టిగా గుద్దాడు' అన్నది.

గుళ్ళో ప్రవేశించి పాండురంగడి విగ్రహం ముందు నిలబడగానే, నామదేవునిలో అష్టసాత్త్విక ప్రవృత్తులు జాగృతమైనాయి. ఎలాగో పూజ పూర్తిచేసి, నైవేద్యం స్వీకరించమని ప్రార్థించి, నిరాకారబ్రహ్మము యొక్క సాకార స్వరూపుడైన ఆ పాండురంగణ్ణి మనస్సులో ధ్యానిస్తూ ఆనంద పారవశ్యంలో మునిగిపోయాడు. కొంచెం సేపయిన తరువాత తెలివి వచ్చి కళ్ళు తెరిచి చూస్తే పళ్ళెం నిండుగా అలాగే ఉన్నది. స్వామి కదలలేదు. ప్రసాదం స్వీకరించలేదు. నామా పాండురంగాష్టకం పాడాడు. భజన చేశాడు. వేళ మించిపోతున్నది.

'నామా! ఇంకా ఎంతసేపు? స్వామి భోజనం అయిందా?' బయట నుంచి జని ఏడుపుగొంతుతో అడగటం వినిపిస్తున్నది. నామదేవుడి ఆవేదన పరాకాష్ఠను చేరుకున్నది. చివరకు పాండురంగడికి ఆ బాలభక్తుని హఠం తీర్చక తప్పలేదు. 'సరే కోటిసూర్యప్రభలను మించిన నా తేజమును నీ కళ్ళు భరించలేవు. కళ్ళు మూసుకో' అన్నాడు స్వామి. నామా కళ్ళు మూసుకున్నాడు కొంతసేపటికి ఒక చల్లని పిల్లతిమ్మెర నామదేవుడి బుగ్గలను, కనురెప్పలను ఎంతో మృదువుగా స్పృశించింది.

నామదేవుడు కళ్ళు తెరిచి చూస్తే పాండురంగడి శిలావిగ్రహం పూర్వంలా ఇటుక బిళ్ళమీద నిశ్చలంగా నిల్చుని ఉన్నది. కాని కంచం ఖాళీ అయింది. భక్త్యావేశంతో నామదేవుడి శరీరం ఒక్కసారిగా పులకించిపోయింది.

ఆనందాశ్రువులు కళ్ళవెంట ధారలుగా ఆగకుండా కారిపోతుంటే నామదేవుడు మైమరచి నృత్యం చేశాడు. రంగడి బుగ్గలు తాకి ముద్దు పెట్టుకున్నాడు. శిరస్సును స్వామి చరణాలకు తాకించి, లేచి స్వామి ఖాళీచేసిన కంచాన్ని పట్టుకొని వాయిస్తూ గుడి బయటకు వచ్చాడు. అది చూసి జనాబాయి ఆనందంతో పురివిప్పిన నెమలిలా నాట్యం చేసింది.

జని అంతరంగంలో నామదేవుడు, తను కలిసి పాండురంగడికే తల్లిగా అయి, ఆ స్వామికి గోరుముద్దలు తినిపించిన భావం కలిగింది. వారి మనస్సులు ఏకమై శబ్దానికి ఆవలగా వెళ్ళిపోతే, ఆ తన్మయ స్థితిలో మౌనంగా ఇద్దరూ మెల్లగా నడిచి ఇల్లు చేరుకున్నారు.

ఇంట్లో ఆఉబాయి మొదట పాండురంగడు నైవేద్యం తిన్నాడు అన్న సత్యాన్ని నమ్మలేదు. జనిని తరచి తరచి ప్రశ్నిస్తున్నది. అంతలో దేవుడి గదిలో నుంచి నామదేవుడు ఆనంద పారవశ్యంతో పాడటం బయటకు వినిపించింది. అది వినగానే ఆఉబాయి కోపం ఎటుపోయిందో, ఆమె కూడ నామదేవుడి ప్రక్కన చేరి తాళం వేయటం మొదలు పెట్టింది. గోణాయి కయితే కళ్ళ వెంట ఆనందాశ్రువులు గంగా ప్రవాహంలా కారిపోతున్నాయి. పారవశ్యంతో నామదేవుడు అచ్యుతా! అనంతా! శ్రీధరా! మాధవా! అని పాడుతూ మైమరచి నృత్యం చేస్తూ తురీయావస్థ అనుభూతిని పొందాడు. అక్కడ ఉన్న వారందరికి నామదేవుడిలో పాండురంగడి రూపం గోచరించింది. నామదేవుడికి పాండు రంగడి అనుగ్రహం కలిగింది అన్న సత్యం వారందరికి అవగతం అయింది.

ఊరు నుండి తిరిగి వచ్చిన దామాశెట్టి గోణాయి చెప్తే జరిగిందంతా విని పాండురంగడు నైవేద్యం స్వయంగా ఆరగించిన సంగతి అందరికీ చెప్పవద్దని, అందువలన సమస్యలు తలఎత్తుతాయని, నామదేవుడికి ఆ పాండు రంగడి దివ్యోన్మాదం, బహుశ ఆ స్వామే అనుగ్రహించి ఉంటాడు అని, నామదేవుడి భక్తి అనే ప్రవాహాన్ని సంసారం అనే ఆనకట్ట ఆపలేదు, అది విఠలుడు అనే సముద్రంలో కలిసినప్పుడే శాంతిని పొందుతుంది అనీ భార్యకు నచ్చచెప్తాడు.

నామదేవుడి శిరస్సుపైన పాండురంగడి వరదహస్తం ఉన్నదని, ఆ రంగడి అభయహస్త కిరణాలలోనే నామదేవుడు ఉన్నాడని తెలిసినా గోణాయి మనస్సులో విచారం పోలేదు. నామదేవుడు పెద్ద అవుతున్నకొద్దీ మనస్సులో విఠల ప్రేమ గంగానదికి వరద వచ్చినట్లు గట్లు తెంచుకొని ప్రవహిస్తున్నది.

అందరూ అందులో చిత్తుగా మునిగిపోతున్నారు. నామా అఖండంగా నామం చేస్తూ, విఠలుడి మహాత్మ్యం గురించి, పండరి గురించి ఎన్నెన్నో విషయాలు చెప్పేవాడు. ఎన్నో తరాలుగా పండరిలో ఉన్న తమ తాతముత్తాతలకు కూడా తెలియని విషయాలు ఈ బుడతడు ఎలా చెప్పగలుగుతున్నాడా? అని అందరూ అబ్బురపడేవారు.

-సశేషం

## సమర్థ సద్గురు

(యాజమాన్యం తదితర వివరాలు)

Form - 4 (8వ నిబంధన ప్రకారము)

| | |
|---|---|
| ప్రచురణ స్థలం | - శ్రీ కాళీగార్డెన్స్, నంబూరు R.S |
| ఎంత కాలానికొకసారి | - మాసపత్రిక |
| ముద్రాపకుని పేరు | - సి.వి. రమణబాబు |
| జాతి | - భారతీయుడు |
| విలాసము | - శ్రీ కాళీగార్డెన్స్ , నంబూరు R.S. గుంటూరు జిల్లా |
| సంపాదకుని పేరు | - జి.యస్.ఆర్. మూర్తి |
| జాతి | - భారతీయుడు |
| విలాసము | - D.No.3-499 శ్రీ కాళీగార్డెన్స్ , నంబూరు R.S. గుంటూరు జిల్లా |
| పత్రిక యజమానులు | - యోగిని శ్రీచంద్రకాళీప్రసాద మాతాజీ ఛారిటబుల్ ట్రస్ట్. D.No. 3-499, శ్రీ కాళీగార్డెన్స్ , నంబూరు R.S. గుంటూరు జిల్లా |

**పై విషయములు నాకు తెలిసినంత వరకు వాస్తవములని తెలియచేయుచున్నాను**

శ్రీ కాళీగార్డెన్స్, (సం) సి.వి.రమణబాబు

ది : 31-3-2009 పబ్లిషర్

## మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

**రాగదే చిత్తమా శ్రీ ప్రసాదుని కొలువ**
**లోకాలు వెదకినా సోకునే పోలగా**
**లోక కళ్యాణమునకై లీలదేహము దాల్చి**
**సాకార బ్రహ్మంబు సాక్షియును ఇతడే ॥ రాగదే ॥**

మనను చిత్తు చేసేది చిత్తం. మనస్సు ఏది కల్పిస్తే చిత్తం దానిని ఊహిస్తుంది. ఆఊహాపోహలనే బుద్ధి నిర్ణయిస్తుంది. సజ్జన సాంగత్యాన్ని చేయాలి. శ్రవణం చేసిన గురుతత్వాన్ని మననం చేసి నిదిధ్యాసలోకి తెచ్చుకోవాలి. దానికి నిరంతర అభ్యాసం కావాలి. పిల్లవాడు ఏడుస్తుంటే వాడికి గోడమీద ఉన్న దేవుణ్ణి చూపిస్తూ 'చూశావా ఎంత బాగున్నాడో దేవుడు!' అంటే వాడు అటువైపు చూస్తాడు. ఏడుపు ఆపేస్తాడు. ప్రపంచ విషయాలు చాలా అడ్డు వస్తాయి. 'మనస్సు ఏమీ బాగుళ్ళేదు సినిమాకు వెళ్దాం' అనిపిస్తుంది. పోనీ సినిమాకు వెళ్తే అక్కడ ఏమైనా సుఖం ఉందా? అక్కడా ఏడుపే. ఒక భక్తుడు తన అనుభవం చేప్తే మనం అంత గొప్పవాళ్ళం కాకపోయినా, మన అనుభవం ఏమిటి? అని బేరీజు వేసుకొంటాం. శబరి తల్లి ఎలాంటి అనుభవం పొందింది? ఆ అనుభవం మనమూ ఎందుకు పొందకూడదు అనుకోము. ఆ మనం అంత గొప్పవాళ్ళమా? అని అసలు ప్రయత్నం చేయం. కాని ప్రపంచవిషయాలకు వస్తే మాత్రం లోకాభిరామాయణం మొదలు పెడ్తాం. 'నీకూ అలాజరిగిందా అక్కా? నాకూ అలానే జరిగింది అని చెప్తాం. మనలో రెండు రకాల మనస్సులు ఉన్నాయి.

**మనోహి ద్వివిధం ప్రోక్తమ్ శుద్ధంచా z శుద్ధమేవచ ।**
**అశుద్ధం కామ సంకల్పం, శుద్ధం కామ వివర్జితమ్ ॥**

ఆ మనస్సు ఎక్కడ ఉంటుదో చెప్పండి? కాలుమీద సూదితో గుచ్చితే 'అబ్బా నెప్పి' అంటాడు. అలామనస్సు శరీరం అంతటా వ్యాపించి ఉంది. అది మనం విచక్షణాజ్ఞానంతో తెలిసికొవాలి. మనస్సు ఎంతసేపూ ప్రపంచంవైపు పరుగులు తీస్తుంది. సాధనతో మనస్సును నెమ్మది నెమ్మదిగా భగవంతునివైపుకు తిప్పాలి. తొందర పనికిరాదు. సముద్రంలో దిగి అజాగ్రత్తగా ఉంటే అలలు లోపలికి లాగేస్తాయి. మనం ప్రపంచమనే సముద్రంలో కాలు పెడితే ఎక్కడ తేల్తామో తెలియదు. అలా కాక మనం ఇసుకలో కాలుపెట్టి కెరటాలబారిని పడకుండా నిలద్రొక్కుకోవాలి. కెరటం వచ్చినప్పుడు కాలు

పైకి ఎత్తితే (అది దైవభావన) కెరటం కాలు క్రిందనుంచి వెళ్తుంది. లేదా కెరటం వచ్చినప్పుడు తల వంచాలి (అది శరణాగత భావన) అప్పుడు కెరటం మన తలమీదుగా వెళ్ళిపోతుంది. మధ్యస్థంగా ఉన్నామంటే కొట్టుకుపోతాం. మధ్యస్థంగాఉండి దానిని పట్టుకుంటే అది అంటుకుంటుంది.

ఇద్దరు బాటసారులు నది ఒడ్డున నడుస్తూ ఉండగా ఒక నల్లని మూట కొట్టుకుపోవటం చూసి వాళ్ళలో ఒకడు నదిలో దూకి దానిని పట్టుకుందామని వెళ్ళాడు. వాడు ఎంతసేపటికీ బయటకు రాకపోవటంచూసి రెండవవాడు "ఒరేయ్! త్వరగా బయటకు రారా'' అని గట్టిగా అరిచాడు. మొదటివాడు "నేను పట్టుకుందామని వెళ్తే అదే నన్ను పట్టుకుంది'' అన్నాడు. ఇంతకీ అది ఒక ఎలుగుబంటి. మననికూడా ఆశ అనే ఎలుగుబంటి పట్టుకుంటోంది.

**ఆశయా బధ్యతే లోకే కర్మణా బహు చింతయా ।**
**ఆయుక్షీణం నజానాతి తస్మాత్ జాగ్రత జాగ్రత ॥**

ఈ క్షణమే ఆఖరిక్షణం అనుకొని ప్రతిక్షణం భగవన్నామస్మరణ చేస్తూ ముందుకు సాగాలి. సత్సాంగత్యం చేయాలి.చిత్తు చేసే చిత్తాన్ని భగవంతుని చరణాలపై ఉంచాలి. గురుదేవులను ఒక భక్తుడు అడిగాడు "బాబూ! మీరు ఎప్పుడూ ఇంద్రియనిగ్రహము, భక్తి వైరాగ్యాల గురించే చెబుతారేమిటి?'' అని.

ఆ భక్తుడు ఒక ఇంజనీరు. శ్రీబాబు ఆయనతో - మీరు ఇళ్ళు కడతారు కదా! ఆ ఇళ్ళు వేటితో కడతారు?

ఇంజనీరు - కంకర, సిమెంటు, ఇసుక, ఇనుము మొదలైనవాటితో.

శ్రీబాబు - మీరు వాటిని మార్చరా?

ఇంజనీరు - లేదు బాబూ మార్చము.

శ్రీబాబు - ప్రతి కట్టడానికి ఎలా అవి ఉపయోగపడతాయో, అలాగే మానవుడు తరించడానికి భక్తి, వైరాగ్యాలు అవసరం. మహాత్ములు చెప్పే బోధను శ్రద్ధగా వినాలి. శ్రవణం సరిగ్గా చేయకపోతే అశాంతి. శాంతి పొందటానికి డబ్బు ఖర్చు లేదు. మహాత్ములు చెప్పినవి చెవిన వేసుకుని వాటిని ఆచరణలో పెట్టాలి. చిత్తాన్ని దారిలో తెచ్చుకోవాలి. అందుకే - **రాగదే చిత్తమా! శ్రీ ప్రసాదుని కొలువ లోకాలు వెదకినా సోకునే పోలగా ।**

చిత్తాన్ని తమ దివ్య చరణారవిందములపై నిలిపి ఉంచే భక్తిని, శక్తిని సద్గురుదేవులు అందరకూ ప్రసాదించెదరు గాక!!

# చావుకు కారణం

గౌతమి అనే ఒక బ్రాహ్మణ స్త్రీ కొడుకు పాముకాటు వలన మరణిస్తే విచారిస్తున్నది. ఇంతలో ఒక బోయవాడు ఆ సర్పాన్ని ఒక త్రాటితో బంధించి తెచ్చి ఆమెకు చూపించి............

బో - అమ్మా! ఇదే నీ కుమారుణ్ణి కాటువేసి చంపింది. దీనిని ఇప్పుడే చంపుతాను. తల చితకబాది చంపేదా? లేకపోతే కత్తితో రెండు ముక్కలు అయ్యేలా నరికి చంపనా?

గౌ - నాయనా! విధి వశమున కష్టాలు కలుగుతాయి. అధములు వాటికి తట్టుకోలేక కొంపలు కూలిపోయినట్లు పెద్దగా కప్పు ఎగిరిపోయేలా ఏడుస్తూ గోలచేస్తారు. ఉత్తములు, ధర్మవర్తనులు ప్రశాంతచిత్తులుగా ఉంటారు. పోనీ ఇప్పుడు నీవు ఈ పామును చంపినందువలన పోయిన నా కొడుకు తిరిగి బ్రతుకుతాడా? అందువల్ల దీన్ని విడిచిపెట్టు.

బో - తల్లీ! ఈ పేద అరుపులతో నా కోపం శాంతించదు. ఏమైనా సరే నేను దీనిని చంపి తీరుతాను.

గౌ - ఓ అర్జునకా! నీవు దీనిని హింసించటానికి నేను ఎంతమాత్రము అంగీకరించను.

బో - అమ్మా! మీరు చెబుతున్నది సబబుగా లేదు. ప్రజలు పాముల బారిపడి చావకుండా వారిని రక్షించటానికి ఈ పాములను చంపటంలో తప్పేమున్నది? పూర్వము ఇంద్రుడు దేవతలను బాధించిన వృత్రాసురుణ్ణి వధించలేదా? అశాస్త్ర విహితము, ధర్మ విరహితము అయిన యజ్ఞం చేస్తూ పరమశివుణ్ణి అవమానించిన దక్షప్రజాపతిని శివుడు శిక్షించలేదా? అటువంటప్పుడు ఈ పామును చంపటం హింస ఎలా అవుతుంది? మీరు దీనిని చంపటానికి అంగీకరించక తప్పదు.

గౌ - ఏమైనా సరే నేను ఈ పాపకృత్యానికి అంగీకరించను.

అప్పుడు ఆ పాము బోయవానితో ఇలా అన్నది.........

పా - అయ్యా! నేనేం తప్పు చేశాను? నా అంతట నేను కోరి నాకై, రోషంతోనో, కోపంతోనో, వైరంతోనో ఆ బాలుణ్ణి కాటువేయలేదు. నేను మృత్యుదేవత అధీనంలో ఉంటాను. నాకు స్వేచ్ఛలేదు. నేను కేవలం మృత్యుదేవత శాసనాన్ని పాటించటం కోసమే అలా చేశాను. సరిగా విచారిస్తే నీకు ఈ సత్యం బోధ పడుతుంది. నా తప్పు లేదని తెలుస్తుంది.

బో - అయినా మృత్యువుకు నీవు సాధనంగా ఉంటావు కనుక నిన్ను దండించటంలో తప్పులేదు.
పా - అయ్యా! కుమ్మరి సారెకు ఏపాటి స్వేచ్ఛ, స్వాతంత్ర్యము ఉన్నాయి. అది కుమ్మరి ఎలా తిప్పితే, అలా తిరగవలసినదేకాని, దాని ఇష్టం వచ్చినట్లు తిరగగలదా? నా విషయమూ అంతే. కరవటం, కరవకపోవటం అనేవి నా వశంలో లేవు. అవి మృత్యుదేవత అధీనంలో ఉంటాయి. అటువంటప్పుడు నన్ను దండించటంలో న్యాయం ఏమున్నది?
బో - ఆలోచించి చూస్తే మీరు మృత్యుసాధనాలు అయితే కావచ్చుగాక, కాని మీరు కాటువేస్తేనే కదా జనులు మరణిస్తున్నది? అందువలన మిమ్మల్ని ఏం చేసినా పాపం లేదు.
పా - అయ్యా! ఋత్విక్కులకుగాని, హవిస్సులకుగాని ఆ యజ్ఞఫలం లభిస్తుందా? యజ్ఞకర్త ఎవరో అతడే ఆ ఫలాన్ని అనుభవిస్తాడు గాని, ఋత్విక్కులకు, హవిస్సులకు ఏమీ లాభం ఉండదు.

పాము ఇలా చెబుతుండగా, అంతలోనే మృత్యుదేవత అక్కడకు వచ్చి ఆసర్పంతో..........
మృ - ఓ సర్పమా! నేను నిన్ను పంపించాను అంటే అది నేను స్వతంత్రించి చేసినది కాదు. నేను నిన్ను ఆజ్ఞాపించినట్లే కాలుడు నన్ను అజ్ఞాపిస్తే నేను నిన్ను కాటువేయమని పంపించాను. అందువలన ఈ బ్రాహ్మణబాలకుడి చావుకు నీవుగాని, నేనుగాని కారణం కాము. సూర్యచంద్రులు, పంచభూతములు అన్నీ ఆ కాలుడి చేతిలో కీలుబొమ్మలు అంటే ఇక మిగిలిన వాటిని గురించి ఏం చెప్పేది? సత్యం ఇది అయినప్పుడు నీవు నా పైన నిందమోపటం న్యాయం కాదు.
పా - (బోయవానితో) అయ్యా! విన్నావుగా మృత్యుదేవత మాటలు. అటువంటప్పుడు నన్ను తప్పు పట్టటం నీకు భావ్యమా?
బో - నీవూ, మృత్యువూ ఇద్దరూ పాపాత్ములే. మీరు ఈ దోషం మీదికాదు, కాలుడిది అన్నంత మాత్రాన మీకు దోషం లేకుండా పోతుందా? నేను అంతమాత్రానికే నిన్ను విడిచి పెడ్తాననుకుంటున్నావా?
పాము, మృత్యువు ఇద్దరూ ఆ బోయవానితో - అయ్యా! స్వేచ్ఛ అనేది లేక, కాలుని వశవర్తులమై, కేవలం ఆ కాలుని ఆజ్ఞలను పాలిస్తున్న మాకు దోషం

ఎలా అంటగలదు? అంటున్నంతలో వారికి కలిగిన ధర్మ సందేహాన్ని తీర్చటం కోసం కాలుడు వారి ముందు ప్రత్యక్షమై ఆ బోయవానిని చూసి ఇలా అన్నాడు.
కా - ఓ కిరాతకుడా! నీవనుకుంటున్నట్లు ఈ బాలుడి మృతికి, ఈ సర్పముకాని మృత్యువుకాని, నేను కాని కారణముకానేకాము. ఈ బాలుడు చేసికొన్న కర్మయే అతడి మృతికి నిజమైన కారణం. ఎవరు ఆచరించిన కర్మలకు రావలసిన ఫలాలను వారికి సమంగా, నిష్పక్షపాతంగా పంచిపెట్టటం వరకే నా అధికారం. అంతకు మించి నాకు కూడా స్వేచ్ఛ లేదు. అందరూ కర్మలు ఆచరిస్తూ జననమరణ వలయంలో పరిభ్రమిస్తూ వారివారి కర్మలకు అనుగుణ్యమైన ఫలాలను అనుభవిస్తూ ఉంటారు. ఈ జగద్వ్యూహంలో మేము ఉపకరణాలుగా ఉపయోగ పడతాం. అంతవరకే. కర్మఫలానుభవాన్ని తప్పించుకోవటం శివుడి వశం కూడా కాదు.

అప్పుడు గౌతమి తన ఆలోచనా సరళి కాలుడు చెప్పిన ధర్మసూక్ష్మానికి అనుగుణ్యంగా ఉన్నట్లు తెలిసికొని బోయవానితో
గౌ - నాయనా! విన్నావుగా కాలుని పలుకులు. అందరూ తాము చేసిన కర్మల ఫలాల వలననే సుఖదుఃఖాలను, జననమరణాలను పొందుతుంటారు. నింద లేనిదే బొందిపోదని దానికి ఇతరులు నిమిత్తంగా కనబడతారు. మనకు అలా కనబడటానికి కారణం మన అజ్ఞానం. అనివార్యమైన ఈ ప్రకృతి ధర్మానికి రోషించటం, శోకించటం సరికాదు. అందువలన ఇప్పుడు నీవు ఈ పామును విడిచిపెట్టు. అప్పుడు బోయవాడు సూక్ష్మమును తెలిసికొని పామును విడిచిపెట్టాడు.

మహాభారత యుద్ధంలో ఎందరి మరణానికో తాను కారణం అయినానని విచారిస్తున్న ధర్మసుతుడికి, భీష్ముడు ఈ ఇతిహాసాన్ని వినిపించి, వత్సా! వీరి మరణానికి, నీవు కాని, దుర్యోధనుడుకాని కారణం కానేకారు. వారి కర్మఫలమే వారిని అలా మృత్యుముఖంలో పడవేసింది. వివేక దృష్టితో చూస్తే దీనికోసం చింతించనవసరం లేదన్న సత్యం నీకే గోచరిస్తుంది అని చెబుతాడు. శాంతనవుడు తెలిపిన ధర్మసూక్ష్మం తెలిసికొని, ధర్మజుడు దుఃఖం వీడి శాంతచిత్తుడైనాడు.
(శ్రీమదాంధ్ర మహాభారత అనుశాసనిక పర్వ ప్రథమాశ్వాసములోని గౌతమీలుబ్ధక సర్పమృత్యుకాల సంవాదం ఆధారంగా)

# బంగారు పిచ్చుక

(గతసంచిక తరువాయి) -పరాశర ప్రసాద్

తాను ముందే చెప్పిన విధంగా తానెంతగానో ప్రేమించిన పుత్రుని చూడలేకపోయానని ఆవేదన చెందలేదు. అక్కడ మమకారానికి తావులేదు. మనస్సు అంతర్ముఖమై గురునామ స్మరణలో నిలిచి స్వస్వరూప స్థితిలో ఘటం విచ్ఛిన్నమైంది. అది కేవలం తాను విశ్వసించిన సద్గురుమూర్తి అవ్యాజప్రేమ వలననే సాధ్యపడింది. కానీ ప్రాపంచిక దృష్టిలో ఉన్న బంధువులు, మిత్రులు దుఃఖించడం సహజమే కదా!

ఈ సంఘటన విన్న మాతాజీగారు మాట్లాడుతూ 'ఆ రూపం అదృశ్యమైంది. ఉపాధిగా చూస్తే బాధగానే ఉంటుంది. దానిని ఎవరూ తొలగించలేరు. ఎవరైనా అంతే! కానీ, అమ్మ ఇప్పుడు ఉపాధికి పరిమితమై కాకుండా అంతటా వ్యాప్తమై ఉంది. మనతోనే ఉంది. మనలోనే ఉంది అన్న భావన కలిగినప్పుడు దుఃఖానికి తావెక్కడది? ఇంక తన ఉపాధిని చూడలేము. అది సత్యమే. కానీ అమ్మదేహంలో వ్యాధి ఉంది. అవయవాలు దెబ్బతిన్నాయి. చాలా బాధపడింది. ఆ బాధని మీరుగానీ, నేనుగానీ, ఇంకెవరినైనా గానీ తీసికోగలిగామా? పోనీ ఆ బాధని మనం నివారించ గలిగామా? ఎంతో వైద్యం చేయించాము. మరి ఆవిడ అలా బాధపడుతూ, నిర్వీర్యమైన అవయవాలతో మంచంలో సేవ చేయించుకుంటూ ఎంతకాలం జీవించాలి? అది ధర్మమా? ఆలోచించండి. కాబట్టి ప్రేమమూర్తి అయిన గురుదేవులు ఆయనలో లయం చేసికొన్నారు. ఆవిడ చేసిన సాధన, గురుసేవ, విశ్వాసం ఫలించాయి. అమ్మ జీవితంలో ఎన్నో కష్టాలను ఎదుర్కొంది. వార్ధక్యం వచ్చిన తరువాత ఆశ్రమానికి రాలేదే! చిన్నవయస్సులోనే సద్గురుమూర్తిని ఆశ్రయించింది. ఆరోజు నుంచి ఏదో ఒక సేవ చేసింది. ఏ పని చేసినా గురుసేవగా భావించింది. ఎన్నో సమస్యలు వచ్చాయి. వాటిని ధైర్యంగా ఎదుర్కొంది. అప్పుడప్పుడు భర్తగారు దూర్వాస మహర్షిలా ప్రవర్తించినా సహించారు. ఆవిడ ఎంత దేహబాధ పడ్డారో మీకెవరికైనా తెలుసా? అయినా తాను ఆశ్రయించిన సద్గురుమూర్తిని ఆరూఢంగా విశ్వసించారు. అదే నిజమైన సాధన. ఇప్పుడు మనమంతా ఏ పూజ చేసినా, ఏ ఆరాధన చేసినా అది ఎవరికి చెందుతోంది? ఆలోచించండి. ఘటాకాశం మహాకాశంలో లీనమైంది. దానిని గుర్తించండి. పరుగుపందెంలో ఆవిడ మనందరినీ అధిగమించి ముందుగా గమ్యస్థానాన్ని చేరిపోయింది. అందువల్లనే

అంత్యకాలంలో భర్తని దుఃఖించవద్దనీ, నిన్నటీ జ్ఞాపకాలతో, రేపటి వ్యాపకాలతో నేటి సంగతినే మరచి ఎందుకయ్యా దుఃఖిస్తావు? గురునామ స్మరణే చేసుకో మని హెచ్చరించారు.'

సమర్థులైన గురుమూర్తిని ఆశ్రయించి, పరిపూర్ణ విశ్వాసంతో వారు ప్రసాదించిన లక్ష్యార్థమును సాధన చేస్తూ, వారు నిర్దేశించిన సేవను చేసికొనేవారికి అవ్యాజకరుణామూర్తి అయిన శ్రీసద్గురుదేవులకు జన్మరాహిత్యం ప్రసాదించక తప్పదు కదా! గురుపుత్రులైనవారు ఎవరైనా ఆ ప్రేమకోసమేగదా తమ సర్వస్వాన్నీ త్యాగం చేసేది. అటువంటి అవ్యాజ ప్రేమను రాజకుమారి నిస్సందేహంగా పొందింది.

ఆవిడకు తన ఒక్కగానొక్క కుమారుడన్నా, మనుమళ్ళు అన్నా అమితమైన ప్రేమ. ఉద్యోగరీత్యా కుమారుడు అమెరికాలో స్థిరపడిపోవటం వలన ఆవిడ మొదట్లో మమకారం చేత కొంత తపన చెందిన మాట యథార్థమే. అనుగ్రహ స్వరూపులైన శ్రీమాతాజీవారు తమవెంట ఆవిడను అమెరికా తీసికెళ్ళి సుమారు 45రోజులు తన కొడుకు మనుమలతో ఆనందంగా గడిపే అవకాశాన్ని కలుగజేశారు.

అంతేకాదు తరువాత ఆరునెలలు తిరగక ముందే కొడుకును, కోడలిని ఇండియా రప్పించి, కన్న కల్లికి రక్తదానం చేసి, మాతృఋణం తీర్చుకునే అవకాశాన్ని కలుగుజేసిన మాతృమూర్తి మాతాజీ.

శ్రీసద్గురుమూర్తి యొక్క అవ్యాజప్రేమకు ఇంతకన్న నిదర్శనమేమి కావాలి? ఈ సంఘటనతో రాజకుమారిలో పేరుకుపోయిన మమకారం రహితమైంది. ఆవిడ హాస్పిటల్‌లో ఉన్నా. విజయవాడలో తన కుమార్తె గృహంలో ఉన్నా, ఆశ్రమంలో ఉన్నా, శ్రీమాతాజీవారు తమ దర్శనభాగ్యాన్ని తనకి కలుగజేసి, ధైర్యంగా ఉండమని ఉద్బోధిస్తూ మానసిక వేదన చెందకుండా సాధన పెంపొందించుకోవటానికి తగిన వాతావరణాన్ని ఏర్పాటుజేశారు. రాజకుమారి తరచుగా శ్రీమాతాజీవారిని చూడాలని అనుకునే వారు. ఆమె సంకల్పించటమే ఆలశ్యమన్నట్లు, ఆ రోజు మేము ఎక్కడ ఉన్నా అక్కడకు శ్రీమాతాజీ విచ్చేసి, వారి దర్శనభాగ్యాన్ని ప్రసాదించేవారు. శ్రీసద్గురు మూర్తి యొక్క అవ్యాజప్రేమను అందుకోవటానికి అవశ్యమైంది కల్తీలేని విశ్వాసం. శ్రీబాబూజీ మహరాజ్ తరచుగా భక్తులకు బోధ చేస్తూ నమ్మికున్న వారికి **బంగారు తిచ్చుకే!** నమ్మనివారికి మిగిలేది **బూడిదే!** అనేవారు. *

# జ్ఞాన పుష్కరిణి

- సుషుమ్న ప్రసాద

1961వ సంవత్సరం మా ఇద్దరి జీవితాలలో మధురమైన, మరపురాని మైలురాయి. పెద్దమ్మ బ్రహ్మపిశాచవై, నన్నావహించి, తీవ్రమైన వ్యాధిగ్రస్తురాలను కావటం సంభవించింది. అప్పుడు వ్యాధి నివారణ అనే మిషతో సద్గురుదేవుని దర్శన భాగ్యము లభించింది. భగవాన్ బాబూజీ మహరాజ్ Supreme spiritual architect, Master planner కావున భూత, వర్తమాన, భవిష్యత్తు తెలిసిన సర్వజ్ఞులు. ఏ జీవిని ఏ మిషతో ఎప్పుడు తరింప జేయాలో తెలిసిన సర్వజ్ఞులు, సర్వసమర్థులు, సద్గురుదేవులు.

బంగారం కొలిమిలో వేస్తే మాలిన్యం పోయి, ద్విగుణీకృతముగా ప్రకాశించునట్లు భగవాన్ బాబూజీ మహరాజ్ తమ దివ్యానుగ్రహమనే కొలిమిలో లలితానంద సరస్వతి స్వామినిలో లేశమాత్రంగా ఉన్న శాస్త్రవాసనలను, సాంప్రదాయముగా వచ్చిన ఆచారమును దగ్ధం చేసి, ఆమెను సానపెట్టిన వజ్రంలా తయారుచేశారు.

భీమవరంలో నాకు పునర్జన్మను ప్రసాదించినప్పుడు ఆమె గురుదేవుని సాక్షాత్తు భగవదవతారంగా గ్రహించింది. భీమవరంలోనే అనేక దివ్యానుభూతులను ప్రసాదించారు. తరువాత వారణాసిలో విశ్వేశ్వరునిగా, కోటప్ప కొండలో సాంబశివునిగా, తిరుమలలో శ్రీవేంకటేశ్వరునిగా ప్రత్యక్షంగా సందర్శించి, తాను పొందిన దివ్యానుభూతులను భక్తులందరికీ పంచిపెట్టి, సర్వులూ బ్రహ్మానందమును జుర్రుకోవాలన్నదే ఆమె మహత్తరాశయం.

ఆమె సద్గురుదేవుని సన్నిధికి రాకపూర్వం చాలా మంది భక్తులు బాబూజీమహరాజ్‌ను ఒక మహనీయునిగా, తమ శ్రేయస్సుని అభిలషించి, తమ కోరికలను తీర్చే వేల్పుగా భావించారు. వారందరికీ శ్రీకాళీప్రసాద్ బాబూజీ మహరాజ్ కేవలము శ్రీకాళీపరాంబికా స్వరూపమని, జననమరణాలనే సుడిగుండము నుండి రక్షించి, నిత్యానందమును ప్రసాదించి, మానవుని మాధవునిగా మార్చే భగవదవతారమని, నిర్విరామంగా, ప్రబోధించి, వారి దృక్పథమును మార్చారు. దేవాలయములో దేవుని అర్చించి సేవించటానికి పూజారివలె ఆమె సద్గురుమూర్తిని ఎలా పూజించాలో, కర్మ పద్ధతిలో ఎలా ఆరాధించి సేవించాలో ప్రాక్టికల్‌గా నిరూపించి అందరికీ మార్గదర్శి అయ్యారు.

1965 డిసెంబర్‌లో ఆమె ఏకైక కుమార్తెను కోల్పోయినా కించిత్ అయినా చలించకుండా జ్ఞానపథంలో పురోగమించింది.

1972లో కాళీవనాశ్రమం స్థాపించినప్పటి నుండి ఆమె పాల్గొనని భగవత్సేవా కార్యక్రమమంటూ ఒక్కటీ లేదు. క్రమశిక్షణకు ఆమె మారుపేరు. సేవా కార్యక్రమమే ఆమె శ్వాస. ఆనందాన్ని పంచిపెట్టటమే ఆమె ఆశయం. పుట్టుకతోనే పెద్దరికాన్ని సంతరించుకున్న ఆ తల్లి ఆశ్రమవాసులందరికీ ఆత్మ బంధువే. నా వయస్సువారికీ, అంతకంటె పెద్దవారికీ ఆమె పెద్దక్క. తరువాత తరం వారికి ఆమె పెద్దమ్మ. ఆమ్మగారని పిలిచేవారు. ప్రాతఃకాల ప్రార్థనా కార్యక్రమం నుండి విఘ్నేశ్వర పూజ, పరమశివుని రుద్రాభిషేకము, గోదీక్ష, వరలక్ష్మీ వ్రతము మరే వ్రతమైనా ఆమె స్వయంగా నిర్వహించేది. విరామమనేది ఆమె నిఘంటువులో లేదు.

ఎవరైనా ఆధ్యాత్మిక విచారణకు వస్తే, అర్ధరాత్రి అయినా అలుపెరుగక ప్రబోధించేది. ఆమె సేవా నిరతిని స్వామి ఎంతగానో ప్రశంసించేవారు. పూజ్యమాతాజీని తన అనుంగు బిడ్డగా భావించి, ఆమె ఆధ్యాత్మిక ప్రగతిని చూసి పరవశించేది. భక్తులెవరైనా గురుదేవునితో ఇంటర్వ్యూ లభించకపోతే గురువుగారి వద్దకు వచ్చి, వారి సమస్యలను చెప్పుకొని ఆమె ఇచ్చే ప్రోత్సాహకరమైన ఆధ్యాత్మిక ప్రబోధనతో స్వాంతన పొంది, ఆనందంతో వెళ్ళేవారు. సద్గురుదేవులే స్వయంగా ఆమెను **గురువుగారు** అని పిలవమని ఆదేశించారు.

భగవత్తత్త్వాన్ని, గురుతత్త్వాన్ని తెలుసుకోవటానికి లలితానంద సరస్వతి మార్గదర్శి అని సద్గురుస్వామి అందరికీ తెలియజేశారు. ఆమెలో విశిష్టమైన ప్రత్యేకత ఏమిటంటే తాను బహుముఖ ప్రజ్ఞాశాలియై అందరికీ వెలుగుబాట చూపే మార్గదర్శియైనా చిన్నపిల్లల్లో చిన్నపిల్లగా, పెద్దల్లో పెద్దగా ఆత్మీయులుగా కలిసిపోయి సర్వులను అలరించేది. ఆధ్యాత్మిక ప్రబోధం చేయటానికి ఎంత ఉత్సాహంతో ఉరకలు వేసేదో, దానికి దీటైన ఉత్సాహంతో స్వయంగా రుచికరమైన వంటకాలు చేసి, భక్తసోదరీ, సోదరులకు స్వయంగా కొసరి కొసరి వడ్డించి సంతృప్తి చెందేది. అందుచేతనే గురుమహరాజ్ ఆశ్రమానికి వచ్చిన భక్తులకు సమయాసమయాలతో నిమిత్తం లేకుండా సంతృప్తిగా భోజనం పెట్టే పని ఆమెకు అప్పజెప్పారు.

-సశేషం

# శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమము, హైదరాబాద్ సత్సంగ సమావేశములు

-నివేదిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమము, హైదరాబాద్ శాఖవారు వార్షికోత్సవ సందర్భంగా ఏర్పాటు చేసిన సత్సంగ సమావేశములు ది. 23-1-2009 నుండి ది. 26-1-2009 వరకు ఆశ్రమ భాగ్యనగరశాఖ భవనంలో జరిగాయి.

ప్రతిరోజూ ఉదయం 4గం.లకు సుప్రభాతం, మేలుకొలుపు, 4గం.30ని.ల నుండి 5గం.ల వరకు ధ్యానం. 5గం. నుండి 6గం. వరకు ప్రార్థన. తరువాత తీర్థప్రసాదములు, 10గం. నుండి 11గం. వరకు సంకీర్తన. 11గం. నుండి 12గం. వరకు సత్సంగ సమావేశము. భగవద్గీత, భక్తియోగముపై పూజ్యయోగిని శ్రీచంద్రకాళీప్రసాద మాతాజీవారి ప్రవచనము. అనంతరము మహాప్రసాద వితరణ. తిరిగి సాయంత్రం 5గం. నుండి 6గం.వరకు సంకీర్తన, 6గం. నుండి 8గం. వరకు సత్సంగ సమావేశము, ప్రార్థన నిత్యకార్యక్రమాలుగా జరిగాయి.

ది.23-1-09 ఉదయం 10గం.లకు సంకీర్తన, భక్తియోగంపై మాతాజీ ప్రవచనం, శ్రీసద్గురుపాదపూజ జరిగాయి. ది.25-1-09సత్సంగ సమావేశ కార్యక్రమం ఉదయం 10గం. నుండి మధ్యాహ్నం 1 గం. వరకు, సాయంత్రం 5గం. నుండి 8గం. వరకు జరిగింది. ది.26-1-09 ఉదయం 10గం. నుండి సామూహిక సద్గురుపాదపూజలు జరిగాయి. మధ్యాహ్నం 3గం.30ని.లకు సత్సంగ కార్యక్రమం, రాత్రి 8గం.లకు ఆశ్రమ బాలబాలికలచే అష్టలక్ష్మి వైభవము అనే నృత్యరూపకం ప్రదర్శనతో, భాగ్యనగరశాఖ వార్షిక సత్సంగ సమావేశ కార్యక్రమం సుసంపన్నం అయింది.

ది.23-1-09 సాయంత్రం 6గం.లకు ఆశ్రమవాసి శివప్రసాద్, 6గం.30ని.లకు ఆశ్రమవాసి జపమాలప్రసాద ఉపన్యసించారు. అనంతరం శ్రీమాతాజీవారి అనుగ్రహభాషణతో ఆనాటి సత్సంగ సమావేశం ముగిసింది.

ది.25-1-09 ఉదయం 10గం.లకు శివప్రసాద్, 10గం.30ని॥ల నుండి 11గం. వరకు డా॥రామ తారక పరబ్రహ్మ ప్రసాద్ ఉపన్యసించిన తరువాత శ్రీమాతాజీ అనుగ్రహభాషణం, భక్తియోగంపై వారి ప్రవచనము జరిగాయి. సాయంత్రం 5గం. నుండి 6గం. వరకు భక్తసోదరులు శ్రీమనోజ్కుమార్ ఉపన్యసించిన తరువాత 7గం. నుండి 8గం. వరకు శ్రీమాతాజీ అనుగ్రహభాషణ చేశారు.

ది.26-1-09 మధ్యాహ్నం 3గం.30ని.లకు మాఘమాసంలో ఆదిత్యహృదయ పారాయణ ప్రాశస్త్యాన్ని వివరించి శ్రీమాతాజీ ఆసక్తిగల బాలబాలికలకు ఆదిత్య హృదయం, హనుమాన్‌చాలీసా పుస్తకాలను పంచిపెట్టారు.

శ్రీశివప్రసాద్ తమ ఉపన్యాసంలో భాగ్యనగరవార్షికోత్సవాలు ఎలా ప్రారంభం అయింది, గురుకృప వారిపై ఎలా వర్షించింది గుర్తుచేశారు. మనకు మానవజన్మ వచ్చినందుకు మనం స్వరూపానుభూతి పొందటమే సార్థకత. అజ్ఞానం వలన, దానితో కలిగిన మోహం వలన, దేహంతో మనస్సుతో తాదాత్మ్యం పొంది, జీవభావంతో సుఖదుఃఖాలను అనుభవిస్తూ ఉన్న మానవుడు సుఖానికి, దుఃఖానికి అతీతము, తన నిజస్వరూపము అయిన సచ్చిదానందానుభూతిని పొందాలి.

కాని మనస్సు విషయాలు సజాతీయం కనుక మానవుడు ఆ సచ్చిదానందం తనకన్న బాహ్యంగా విషయాదులలో ఉన్నది అని భ్రమించి, విషయాదుల వెంట పరుగులు తీస్తాడు. ఎన్ని విషయాలను అనుభవించినా, ఎన్ని కోరికలు తీరినా అవి అగ్నిలో ఆజ్యం పోసినట్లై ఇంకా ఇంకా పెరుగుతాయి తప్ప తగ్గవు. ఏదో తాత్కాలిక సుఖాలు తప్ప సచ్చిదానందానుభూతి కలుగదు.

దానిని పొందాలి అంటే సంకల్పాలను అవి కోరికలుగా మారే లోపలే సంకల్ప స్థితిలోనే అరికట్టాలి. మానవుడు స్వశక్తితో దాన్ని సాధించలేడు. భగవదనుగ్రహం లేదా గురుకృప లేనిదే అది సాధ్యం కాదు. మనం భక్తియోగంలో శ్రవణం చేసినట్లు భగవంతుణ్ణి సాకారంగా ఉపాసించటం దానికి తేలికైన మార్గం.

భగవదనుగ్రహం లేదా గురుకృప పొందటానికి కులగోత్రాలు అడ్డురావు. కలియుగంలో నామసంకీర్తన భగవదనుగ్రహం పొందటానికి అందరికీ అనుకూలమైన మార్గం అని చెప్తూ శివప్రసాద్ పెద్దకులం వాడైన చోఖామేళుడు పాండురంగడి అనుగ్రహానికి ఎలా పాత్రుడైనదీ వివరించారు.

శివప్రసాద్ ఇంకా మాట్లాడుతూ మనకు బాహ్యంగా ఎంత ప్రపంచం కనిపిస్తున్నదో అంత ప్రపంచమూ, మనం ఇంతవరకూ ఎత్తుతూ వచ్చిన జన్మలలో ఆచరించిన కర్మల వాసనా రూపంగా మన మనస్సులో ఉన్నది అన్నారు.

-సశేషం

# మాతాజీ బోధామృతం

(గత సంచిక తరువాయి) - శివ ప్రసాద్

భగవంతుడి కృపను సాధించటానికి మనం ఏదో పట్టుకొని ఎక్కడికో వెళ్ళనక్కర్లా. మనకు లభించిన ఆ గురుపాదమును, మనకు అందించిన ఆ గురుతత్త్వమును, భగవన్నామమును, భగవత్తత్త్వమును, భగవంతుని నిజస్వరూపమును, నిజతత్త్వమును అర్థం చేసికొంటే చాలు.

అది ఏ బజార్లోనో అమ్మబడేది కాదు. దానికోసం ఒక్క రూపాయి కూడా ఖర్చుపెట్టనక్కర్లేదు. కాని దానిని తెలిసికోకపోతే, మన జీవితమే వృథాగా ఖర్చు అయిపోతుంది. భగవంతుని గూర్చి నీవు ఎంతకాలం సత్సంగంలో ఉంటావో అంతకాలం నీ నిత్యకాలంలో జమఅవుతుంది. లేకపోతే ఏమౌతుంది? ఖర్చైపోతుంది. నిత్యకాలంలో జమ అవదు. కాలం అంతా ఖర్చై నీకు మిగిలేది ఉండదు.

నిత్యకాలంలో జమ అవ్వాలి అనుకున్న సాధకుడు ఎప్పటికప్పుడు దానిని గురించి విచారణ చేయాలి. ప్రతి దానిని గురించి విచారణ చేయాలి. ధ్యానానికి కూర్చున్నా భగవన్నామం చేసుకుంటాము. పైగా మనం ఆశ్రయించిన భగవంతుడు చక్కని అనుభూతులను ప్రసాదిస్తాడు. మనం చక్కని హాయిని పొందుతున్నాము. సమయం తెలియదు. నేను ప్రొద్దున్న అనుకున్నాను కూడ. 'ఏమిటో సమయం ఇంత తొందరగా అయిపోతోందే' అని. ఎవరితోనో అన్నాను కూడా.

ప్రతి విషయంలోనూ అవగాహన ఉండాలి. మామూలు విషయాన్ని గుర్తించటం వేరు. కానీ భగవద్విషయాన్ని గుర్తించినప్పుడు అది మన స్వంతం. అది మనకు భిన్నంగా ఎప్పుడూ లేదు. భగవంతుడు మనలోనే ఉండి, తను ఉన్నాను అనే సత్యాన్ని కొన్ని కొన్ని అనుభవాల ద్వారా మనకు అందిస్తున్నాడు. భగవంతుడి అనుభూతిని పొందటానికి, సాధన ఎప్పుడో తరువాత చేద్దాంలే అనుకుంటే మనకు ఇచ్చిన ఈ జీవితం చాలదు.

కాని పట్టుదలతో ఇప్పుడే చేయగలం అన్న విషయాన్ని గుర్తిస్తే ఎంతసేపు కావాలి? వాల్మీకి గొప్పవాడుగా మారటానికి ఎంతసేపు పట్టింది? ఒక గజదొంగేగా రత్నాకరుడు? అయినా ఎంతసేపు పట్టింది? మరి మహాత్ముల దర్శనం అటువంటిది. **సాధునాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాపనాశనం,**

**సంభాషణం కోటితీర్థ పుణ్యం, వందనమ్ ముక్తి సాధనమ్.** సాధువుల దర్శనమైంది. ఎక్కడ దాచావో అన్నీ బయటకి తీయ్ అన్నాడు. దార్లు కొట్టే గజదొంగ అతడు. కాని అంతవరకూ రానిది అతని జీవితంలో మార్పు రావటానికి ఎంత సమయం పట్టింది? ఒక్క క్షణం! మనకు కూడా ఆ క్షణం తప్పక వస్తుంది. ఆ క్షణం మనదే.

ప్రతిక్షణం మనం మంచి చేస్తుంటే, అప్పటి వరకు పేరుకుపోయిన కానివిపోనివన్నీ భగవన్నామము, ధ్యానము, జ్ఞానము అనే అగ్నిలో ఆహుతి అయిపోయి, మన జీవిత సత్యాన్ని మనం గ్రహించ గలుగుతాము. వెంటనే ఎంత గొప్పవాడైపోయాడు రత్నాకరుడు, రామనామాన్ని స్మరించి. రాముడు ఉన్నాడు అంటే, ఆ రామాయణం అంతా వాల్మీకి ద్వారానేగా వచ్చింది. ఆయన నోరు తిరగకపోతే 'మరా, మరా' అనేగా జపం చేసింది? అక్కడ ఒక గురుపాదము, ఒక లక్ష్యార్థము, రామ అనే మంత్రము ఉన్నాయి. రాముణ్ణి ఎప్పుడు తలచుకున్నా బోలెడంత రామాయణం. మన నిత్య సత్యాన్ని మన ఋషులు ఎలా ఆచరించారో చేసి చూపించాడు రామచంద్రుడు.

ఎంతకాలం కావాలి? ఎక్కడండీ, కొంతకాలం పడుతుందండీ అనుకోనక్కర్లా. ఇప్పుడే, ఈనాడే, ఈక్షణమే, నీవు భగవంతుణ్ణి పరిపూర్ణంగా పొందినవాడివి అన్న సత్యాన్ని గుర్తింపజేస్తూ ముందుకు తీసికొని వెళ్తున్నారు గురుదేవులు. దాన్నెప్పుడూ మనం గుర్తిస్తూ ఉండాలి. మనస్సు విచారణ ద్వారా భగవన్నామంలో ఉన్న మాధుర్యాన్ని తాను పొంద గలుగుతుంది, ఆస్వాదించ గలుగుతుంది. మనస్సుకు భగవన్నామంతోపాటు విచారణ కూడ తోడుకావాలి. ఎందుకని? మనం ప్రపంచంలో తిరుగుతున్నాం కనుక.

భగవన్నామం చేయటం వేరు. విచారణ వేరు. మనం అలవాటుపడాలే కాని విచారణలో నిద్ర ఉండదు. ఇప్పుడు మనం ధ్యానం చేసుకుంటున్నాము. మన దేవుడు మనకు ధ్యానం చక్కగా నిలిపాడు అనే ఒక అనుభూతి. ఒకవేళ మనస్సు లేచిందే అనుకోండి, ఎక్కడికి పోతుందది? ఎక్కడికి పరుగెత్తినా ఈ కనిపించేవాటిలోకే తప్ప కనిపించని వాటిలోకి వెళ్ళదు కదా!

మనస్సుకు ఆధారం ఏమై ఉన్నది? బుద్ధి. బుద్ధికి ఆధారం తానే. ఈ 'బుద్ధి'కి వెనుక 'తానే' అంటే ఆత్మస్వరూపమే. దానిని మళ్ళా 'నేను' అనలా. నేను అంటే దానికి అహంకారం జోడై ఉంటుంది. అందుకని 'తాను' అన్నారు. 'తాను' తనువు కాదు. తనువులో ఏదైతే సర్వవ్యాపకమై ఉండి, ఏది

ఉన్నందున ఇంద్రియాల ద్వారా అన్నిటినీ అనుభవించ గలుగుతున్నామో, అన్నిటినీ చేయగలుగుతున్నామో, ఆ తానైన ఆత్మ స్వరూపాన్ని నేను అనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. అప్పుడిక ఏ విషయం గుర్తు వస్తుంది?

శనగగింజకు వేపరసంలో ముంచితే చేదు వస్తుంది. పంచదార పానకంలో నానితే తీపి వస్తుంది. అలాగే మాధుర్యాన్నే ఇచ్చే మాధవుని దివ్యనామ స్మరణ, మాధవుని తత్త్వంలోనే మనస్సు ఉంటే అటువంటి మనస్సు నుంచి మాధుర్యమే వస్తుంది కాని వేరేది రమ్మంటే మాత్రం వస్తుందా? జాస్మిన్ నుంచి మల్లెల సుగంధమే వస్తుంది కాని బురదగుంట వాసన రాదుకదా!

అదే విధంగా మనస్సు యొక్క ప్రవృత్తి ఎలా ఉంటుందో, మన స్వభావం కూడా ఆలా మారుతుంది. కాని దానిని ఎప్పటికప్పుడు గుర్తిస్తూ మనం భగవన్నామందు విశ్వాసం కలిగి ఉండాలి. తత్త్వ విచారణ చేసికోవాలి. ఎంతసేపూ ఇంకోళ్ళెవరో దొరికితే వాళ్ళను తినేయటానికి కాదు. వాళ్ళు మనను తినక్కర్లేదు. మనం వాళ్ళను తినక్కర్లేదు. మన గురుదేవులు ఏదైతే చెప్పారో, మహాత్ముల ద్వారా బోధ ఏదైతే జరిగిందో, దానిని మనం నిరంతరం మనస్సుతో విచారణ చేసికోవటమే మానవ జన్మ వచ్చినందుకు సార్థకత. *

## శ్రద్ధాంజలి

ఆశ్రమం నుండి వెలువడే సమర్థ సద్గురు ఆంగ్ల త్రైమాసిక పత్రిక గౌరవ సంపాదకులైన శ్రీరామస్వామి సంపత్‌గారి సతీమణి శ్రీమతి రాధామణి ది.4-2-09 బుధవారం నాడు శ్రీసద్గురు సాయుజ్యం పొందారు. వీరి వయస్సు 62 సంవత్సరాలు. వీరికి భర్త, ఇద్దరు కుమార్తెలు కలరు. శ్రీసద్గురుదేవులు వీరి ఆత్మకు శాంతిని ప్రసాదించెదరు గాక!

## శ్రద్ధాంజలి

ఆశ్రమవాసులు శ్రీమతి బాదర్వాడ నారాయణమ్మగారు ది.20-2-09 శుక్రవారంనాడు శ్రీసద్గురు సాయుజ్యం పొందారు. వీరి వయస్సు 73 సంవత్సరాలు. వీరికి ఇద్దరు కుమార్తెలు కలరు. శ్రీసద్గురుదేవులు వీరి ఆత్మకు శాంతిని ప్రసాదించెదరు గాక!

# మాతాజీ సత్సంగ్ డైరీ

-రమణ ప్రసాద్

గుండుగొలనుగ్రామంలో డిశెంబరులో జరిగిన శ్రీశ్రీశ్రీగీతాయజ్ఞంలో 4వ తేదీన బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ మాతాజీ చేసిన ప్రబోధం ఇక్కడ ప్రచురిస్తున్నాము. -ఎడిటర్

హృదయబాబు మన హృదయాలలో తమను తామే ప్రతిష్ఠించుకొని తమ పాదాలవద్ద మనకు అక్కడ స్థానం ఇచ్చారు. బాహ్యమైన ఎటువంటి పూజా పరికరాల అవసరం లేకుండా భగవంతుని మానసికంగా అర్చించుకోవటం ధ్యానం అవుతుంది. మనమందరం ఆ ప్రయత్నంలోనే ఉన్నాం. కాని సాధించలేకపోతున్నాం. దానికి కారణం ఏమిటి? బియ్యంలో రాళ్ళు ఉంటే, వాటిని ఏరిపారేస్తాము. రాళ్ళు ఏరిన తరువాత ఆ బియ్యంతో అన్నం వండి భుజిస్తే తృప్తి. సర్వవ్యాపకంగా ఉన్న పరమాత్మను గుర్తించటానికి మనకు భగవంతుడు మనస్సును ఇచ్చాడు. ఇంద్రియాలకు ఒక పరిధి ఉంది. కళ్ళతో కొంతవరకే చూడగలవు. కాని మనస్సుకు ఆ హద్దు లేదు. ఇక్కడే ఉండి అమెరికాలో ఉన్న వారి గురించి ఆలోచిస్తుంది.

మొదటిసారి శ్రీబాబు అమెరికా వెళ్తూ నన్ను బొంబాయిదాకా తీసుకువెళ్ళారు. నేను శ్రీ బాబు అమెరికాలో ఎలా ఉన్నదీ, ఏం చేస్తున్నదీ ఉహించుకున్నాను. మనస్సు అంటేనే ఊహాపోహ. ఎదట ఉన్నవాడిని గుర్తించాలంటే మనస్సు ఉంటేనే తెలుస్తుంది. ఒక రుచికరమైన పదార్థం మన ముందే ఉన్నా, మనస్సు దానిమీద లేకపోతే గుర్తించలేము. అలాగే మనస్సు బాగాలేనప్పుడు కూడా దానిని తినలేము. ఏది సాధించాలన్నా మనస్సునే ఉపయోగించుకోవాలి. ఒక బాణంలాగా. ఏకాగ్రత దిగజారితే బాణం లక్ష్యాన్ని ఛేదించలేదు. ఒక ఫోన్ వస్తే మనకు ధ్యానభంగమవుతుంది.

ప్రశాంత వాతావరణంలో ధ్యానం చేస్తూఉంటే ఫోన్ వస్తే ఏమవుతుంది? దాన్ని మనస్సు యాక్సెప్ట్ చేస్తే ధ్యానంనుంచి లేచిపోతాము. మనం చేసే కార్యక్రమానికి మనస్సు సహకరిస్తే దేహం సహకరిస్తుంది. మనస్సును ఖాళీ చేసి మనస్సులో గురుదేవులను నిలుపుకోవాలి. మనం తీసికున్న లక్ష్యార్థంపై పూర్తి విశ్వాసం ఉండాలి. ఒక మంత్రం తీసికొని దానికి అధిష్ఠానమైన దేవుని కీర్తిస్తూ, ఆయన లీలలు పాడుతూఉంటే ఆ మూర్తిలో నీ గురుదేవుడు

నిలుస్తాడు. మంత్రం తీసికొని మాలతో అక్షర లక్షలు తిప్పటం నేర్చుకుంటే మన ప్రవర్తన భిన్నంగా ఉంటుంది. శ్రద్ధగా గురుదేవుల బోధ విని మననం చేసుకుంటే వారు మనని ఈ వాసనాదులనుంచి బయటకు తీసికెళతారు.

మనం పేర్లకు అలవాటు పడి ఉన్నాం. మనం ఆ పేరుతో పిలిస్తేనే పలుకుతాం. ఎవరైనా కనిపిస్తే **ఓం గురురాం నమస్తే** అని పలకరించండి. ప్రతిదానిలో గురురాముడిని చూడండి. గురుదేవులు మనకు అలా చేయమని చెప్పారు కనక మనకి అది మంత్రమైంది. విశ్వాసం ఆరూఢం కావటానికి మనకి ఇవన్నీ సహకరిస్తాయి. మనం చేసే మంత్రానుష్ఠాన శక్తి వలన మనం అన్నిట్లో గురుదేవుణ్ణే చూస్తాం. మనం అనుష్ఠానం చేసే మంత్ర శక్తి అంతటా ఉంది. మనం ఏ క్షేత్రం వెళ్ళినా, మన గురుదేవుడే ఆరూపంలో ఉన్నాడు. కేదారేశ్వరుని గుడికి వెళ్ళినా ఆ రూపంలో నా గురుదేవుడే దర్శనం ఇస్తాడు. వ్యక్తిత్వ దృష్టి ఉంటే అలా చూడలేము. నువ్వు బజారులో ఉన్నా, సంతలో ఉన్నా నీ మనసులోకి ఆ బజారుగాని, ఆ సంతగాని రాకూడదు. అందరిలోను తానై ఉన్నావు. కాని వ్య.క్తిత్వ దోషంవల్ల కనిపించటంలేదు.

మనస్సును ఏకాగ్రంచేయాలంటే మనం చేసిన శ్రవణం సహాయంతో ఏకాగ్ర భావన తెచ్చుకుంటూ , ఎప్పటికప్పుడు వ్యక్తిత్వ భావన రహితం చేసికోవాలి. అంతఃకరణ శుద్ధి కావాలి. రామచంద్రుని చూపు ఎక్కడ ఉంది? **హృద్దేశేర్జున తిష్ఠతి** అన్నాడు భగవానుడు. ఆంజనేయుడు'నా గుండెలో ఉన్నాడు చూడండి' అని తన గుండెను చీల్చి చూపించాడు. పథ్యం పాటించాలి. మితాహారం, మితనిద్ర , మిత భాషణమే పథ్యం. ఏవేవి అనవసరమో వాటిని తొలగించుకోవాలి. ఏవేవి అవసరమో వాటిని సంపాదించుకోవాలి. ఇంకొకచోట ఉంటే అసలుఇలా కూర్చోగలమా? ఇటువంటి చోటుకు రాగలము అని కూడ మనకు తెలియదు కదా. ఎటువంటి స్థితిలో ఉన్నా అభ్యాసం చేయాలి.

ఉదాహరణకు భీష్మలవారిని తీసుకోవచ్చు. శిఖండిని చూసి అస్త్ర సన్యాసం చేశాడు. ఆ మహానుభావుడు క్రింద పడకూడదు. అర్జునుడు అంపశయ్యను తయారు చేశాడు. అలా గీతాజయంతినాడు ( మార్గశిర శుద్ధ ఏకాదశి)ఆ సూది బాణాలమీద శయనం చేసి ఉత్తరాయణంలో మాఘశుద్ధ ఏకాదశి(మాఘశుద్ధ అష్టమి అని కొన్ని గ్రంథాలలో ఉన్నది) వరకు తన ప్రాణాలను నిలిపి శ్రీమన్నారాయణ ధ్యానం చేశాడు. ఏచిన్న కదలిక కలిగినా 'ఏం నాయనా' అని పలకరించేవాడు. నిద్ర లేదు. అయినా సమాధిస్థితిలో

ఉన్నాడు. నిరంతరం శ్రీ కృష్ణపద ధ్యాసయే. ఓహో ఎంత భాగ్యవంతుడండీ! శరీరాన్ని గురించి బాధ పడలేదు. అప్పుడే ఆయన మనకు విష్ణు సహస్రనామం ప్రసాదించారు. మనం కూడా అదే ప్రయాణంలో ఉన్నాం.ఇలా ఉంటే భగవంతుని చేరుకోవచ్చు.దానికి అడ్డు వచ్చేది మనస్సు. సత్సంగంలో ఉన్నప్పుడు మనస్సు విషయాలపై పోదు. అదే సమాధి స్థితి.

ధ్యానంలో అడ్డువచ్చినవాటిని తొలగించుకోవాలి. మనస్సును నిర్మలం చేసికొవాలి. చీమ, తాబేలు లాగా మనం మన ప్రయాణం మొదలు పెట్టాలి.ప్రయత్నం చేయడమే మన వంతు. ఎప్పుడు ఏది ప్రసాదించాలో భగవంతునికి తెలుసు. సహజస్థితిలో ఉండి మనస్సును అంతర్ముఖం చేసి హృదయంలో ప్రతిష్ఠితమై విరాజిల్లుతున్న గురుమూర్తిని ధ్యానించాలి. ఆంజనేయస్వామి తారకరాముని,జగన్మాతను దర్శించినట్లు మనంకూడా మనస్సును నిలిపి ఇష్టదేవుని దర్శించాలి. అట్టి శక్తిని, భక్తిని అనురక్తిని, సాధనాసంపత్తినిగురుదేవులు ప్రసాదించుగాక! సుఖీభవ! సుఖీభవ!!

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**మార్చి 2009**

**10 మంగళ పూర్ణిమ, హోలీపండుగ** శ్రీసద్గురుపాదపూజ

**20 శుక్ర శ్రీగురుదశమి** సాయంత్రం 6గం॥శ్రీసద్గురుపాదపూజ, సత్సంగ సమావేశము.

**25 బుధ మాసశివరాత్రి**

**27 శుక్ర ఉగాది శ్రీవిరోధినామ సంవత్సరారంభం**, పంచాంగ శ్రవణం, శ్రీసద్గురుపాదపూజ, సత్సంగసమావేశం, భక్తసమారాధన.

**ఏప్రియల్ 2009**

**3 శుక్ర శ్రీరామనవమి,** శ్రీ సద్గురు పాదపూజ, శ్రీ సీతారాముల సామూహిక కళ్యాణాలు, భక్త సమారాధన.

**9 గురు పూర్ణిమ,** శ్రీ సద్గురు పాదపూజ.

**19 ఆది శ్రీగురుదశమి,** సత్సంగం,శ్రీ సద్గురు పాదపూజ.

**23 గురు మాసశివరాత్రి.**

**29 బుధ శంకర జయంతి,** శ్రీ సద్గురు దివ్యమంగళమూర్తి చతుర్దశ వార్షిక ప్రతిష్ఠా మహోత్సవము, శ్రీసద్గురుపాదపూజ, సత్సంగ సమావేశము, భక్తసమారాధన.

## సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

- స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

### గురువు ప్రత్యక్ష భగవానుడు

ఈ ఆరాటమూ, ఆవేదనా దుర్భరమైనప్పుడు,

"నీవే తప్ప నితఃపరంబెరుగ మన్నింపం దగున్ దీనునిన్

రావే ఈశ్వర ! కావవే వరద !" అనే ఆక్రందనము గుండె లోతులను చీల్చుకుని వెలువడినప్పుడు, ఆర్తితో పిలిచిన ఆ పిలుపు, యీ తోలుతిత్తిలోనే, విలవిలలాడే ఆ గుండెలోనే ఓ మూల ఒదిగి ఉన్న ఆ భగవంతుడికి వినిపిస్తుంది. ఆ అదను కోసమే ఎదురు చూస్తున్న ఆ కరుణా మూర్తి ఆ క్షణంలోనే సద్గురువు రూపం ధరించి

"ఎడద లోతుల నుండి నడయాడి వచ్చి, నీసన్నిధిలో నిల్చి, వెన్ను తట్టి,

నీవాడ నేనుండ నీకేల భయమంచు



దాల్చిన అభయ హస్తమ్ము" వాడై పరీక్షిన్మహారాజు కు శుక మహర్షి వలె దర్శనమిస్తాడు. "తాపత్రాయాభీల దావాగ్నులను తన చల్లని చూడ్కి వర్షమ్ము"తో ఉపశమింప చేస్తాడు.

అజ్ఞానమనే చీకటిలో తానెవరో, తన చుట్టూ ఉన్న యీ ప్రపంచమంతా ఏమిటో తెలియలేక తికమక పడుతున్న మానవుడు, గర్భస్థుడై ఉన్న శిశువు వంటి వాడు. మాతృ గర్భస్థుడై ఉన్నపుడు శిశువు మావితో కప్పబడి, గర్భనరకాన్ని అనుభవిస్తూ ఉంటాడు. ప్రసవమైనప్పుడు మంత్రసాని ఆ మావిని శుభ్రంగా తొలగించి వేసి బొడ్డు కోసేసరికి శిశువు ఆ గర్భనరకం నుండి స్వేచ్ఛను పొందుతాడు. అలాగే ప్రపంచమనే నరకంలోనికి ప్రవేశించిన జీవుడు మాయచేత కప్పబడి, తానెవరో తెలియని అజ్ఞాన స్థితిలో ఉంటాడు. గురుపరమేశ్వరుడు అనుగ్రహ స్వరూపుడై ఆ మాయను తొలగించి (మోహబంధాన్ని విచ్ఛేదం చేసి) తన దివ్య కర కమల గర్భ జనితునిగా అతనికి పునర్జన్మను ప్రసాదించి "పునరపి జననం

**పునరపి మరణం । పునరపి జననీ జఠరే శయనం"**అనే విషవలయం నుండి అతనికి విముక్తి కలిగించి శాశ్వతునిగా అవినాశిగా, పర బ్రహ్మ స్వరూపునిగా అతనిని ప్రకాశింప చేస్తాడు. అతడే సత్య గురువు. దీనిని బట్టి గురువు యొక్క నిజ స్వరూపము, ఆయన అనన్య సామర్థ్యము వెల్లడి అవుతున్నది.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ।**
**ధర్మ సంస్థాపంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

"పరాకాష్ఠకు చేరుకున్న భక్తి హృదయాలకు జ్ఞాన ఫలాన్ని అందించి, అలాగే పరాకాష్ఠకు చేరుకున్న దుర్మార్గుల దౌష్ట్యాన్ని నిర్మూలించి వారిని కూడా ఉద్ధరించటానికి, నేను ఎన్ని సార్లైనా, ఎన్ని రూపాలలో అయినా, ఎక్కడైనా, ఎప్పుడైనా అవతారం ధరించి వస్తా"నని గీతాచార్యుడు అభయ మిచ్చాడు. ఈ అభయవాక్యం నిజం చేయటానికే, ఎన్నో భగవదవతారముల, ఎందరో మహాత్ముల ఆవిర్భావము యీ జగత్తులోజరిగింది, జరుగుతున్నది, ఇకముందు జరుగుతుంది కూడాను. "వారందరూ మానవుని హృదయ కంజాతములో పేరుకుపోయిన అజ్ఞాన తిమిరములను హరించి, జ్ఞానభాస్కర కిరణములను వ్యాపింపచేసి, మానవుని మాధవునిగా మార్చగల సమర్థ సద్గురువులు"అని శ్రీబాబు చెబుతూ ఉండేవారు.

పుట్టినప్పటి నుండి మానవుడు పునర్జన్మరహితుడై ముక్తిపొందే వరకు, ఎందరో గురువుల మార్గదర్శకత్వంలో పురోగమించవలసి ఉంటుంది.

ముక్తికి మూలమైన మానవ జన్మను ప్రసాదించిన తల్లిదండ్రులు **ప్రథమ గురువులు.**

లౌకిక విద్యలు నేర్పే గురువులు **విద్యాగురువులు.**

వీరెవరూ, పునర్జన్మను రహితం చేసే ఆత్మవిద్యను ప్రసాదించలేరు.

అటువంటి విద్యను పొందగోరి, జిజ్ఞాసువులై వచ్చి తమను ఆశ్రయించిన వారికి ఆత్మ విద్యను ప్రసాదించే వారే **సద్గురువులు.**

ఇక జిజ్ఞాస అంటే ఏమిటో కూడా తెలియక అజ్ఞానమనే గాఢ తమస్సులో మునిగి నిద్రిస్తున్న మానవులను, కటిక చీకటి అలుముకున్న ఆ అర్ధరాత్రివేళనే తమకు తామై వచ్చి తలుపు తట్టి, నిద్రలేపి, చేయూతనిచ్చి, జిజ్ఞాస అనే అరుణోదయం వైపు నడిపించి, కోటిసూర్యుల కాంతిని తలదన్నే స్వస్వరూపజ్ఞాన ప్రకాశములో నిలిపి, 'త్వమేవాహం' అనే అద్వైతశిఖరానికి

చేర్చటానికి లోకకళ్యాణార్థమై అవతరించి వచ్చిన పరమ శివ స్వరూపులే **సమర్థ సద్గురువులు.**

పరతత్త్వమే పర శివ స్వరూపమై, ఆ పరమ శివుడే నారాయణుడై, ఆ నారాయణుడే దేవకీపుత్రుడైన శ్రీకృష్ణ పరమాత్ముడై, ఆయనే గీతాచార్యుడై, గురుపరంపరకు ప్రతినిధిగాను, నరుడైన అర్జునుడే మనందరికి ప్రతినిధిగాను నిలిచారు. గురువైన గీతాచార్యుడే అర్జునుని నెపంతో మానవాళికందరికీ గురుబోధామృతరూపమైన శ్రీభగవద్గీతను అందించి, లోకాచార్యుడైనాడు. శ్రీదత్తాత్రేయస్వామి, శ్రీదక్షిణామూర్తి, వశిష్ఠ, పరాశర, వేదవ్యాసాది మహర్షులందరు ఆ గురు పరంపర లోనివారే. పూర్వ యుగాల మాట అటుంచి, కలియుగంలోనే శుక, గౌడపాద, గోవిందపాద, శంకర, రామానుజ, మధ్వ,విద్యారణ్య, మాధవాది ఆచార్యులు; గౌతమబుద్ధ, నానక్, క్రీస్తు, మహమ్మదు వంటి ప్రవక్తలు; తులసీదాసు, చైతన్యమహాప్రభువు, మీరా, కబీరు, జ్ఞానదేవుడు, సమర్థ రామదాసు, శ్రీరామకృష్ణ పరమ హంస, శ్రీవివేకానంద, స్వామిరామతీర్థ, షిరిడీసాయిబాబా, శ్రీరమణమహర్షి మొదలైన మహనీయులందరూ ఆ గురు పరంపరా కల్ప వృక్షానికి విరబూసిన మనోజ్ఞ కుసుమాలే.

ఈ గురుపరంపరా కల్పవృక్షానికే ఎప్పుడో, ఎక్కడో ఆవిర్భవించి, ఇరవయ్యో శతాబ్ది పూర్వభాగంలో ఆంధ్ర ప్రదేశ్‌లో తమకు తాముగా వెల్లడై, ఇంచుమించు అర్ధశతాబ్ది పాటు భారతదేశంలోనేగాక విదేశాలలోను, సంచరించి, తమ సురభిళ ఆత్మ బోధా పరిమళాలను వెదజల్లిన దివ్యకుసుమమే, **సర్వాధిష్ఠాన చైతన్య సమర్థ సద్గురు, శ్రీశ్రీశ్రీ హనుమత్ కాళీ వర ప్రసాద బాబూజీ మహరాజ్.** మొదట్లో ఇంచుమించు మూడు దశాబ్దాల పాటు ప్రాచుర్యానికి, ప్రకటనలకు విముఖులైన శ్రీబాబు గుప్తంగానే ఉండిపోయారు. వారి దర్శన, వందన, బోధా, శ్రవణ భాగ్యాలను పొందగలిగిన భక్తులు అనేక ప్రదేశాలలో ఉన్నా, బహుళ ప్రజానీకానికి అవి అందుబాటులో లేకపోయాయి. కాని భక్తుల సంఖ్య పెరిగినకొలది, తాము పొందగలిగిన ఈ మహాభాగ్యం, సకలమానవాళికి అందించవలెననే సత్సంకల్పంతో భక్తులు శ్రీబాబును పదే పదే ప్రార్థించి, ఒక ఆశ్రమ నిర్మాణానికి సమ్మతింపచేశారు.

-సశేషం




(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

"లేదు...లేదు... ఇది యుద్ధంలో 18వరోజు అర్ధరాత్రి నేను కృపాచార్యుడితో పాండవ శిబిరం వద్దకు వెళ్ళినప్పటి విషయంకాదు ఉద్ధవా!... యుద్ధానికి కొన్ని సంవత్సరాలకు పూర్వమే... ద్వారకలో ఒకసారి కృష్ణుని మందిరంలో శ్రీకృష్ణుని ఆతిథ్యం స్వీకరిస్తూ నేను ఆయనను హత్య చేయటం గురించి ఆలోచించాను... కృష్ణుణ్ణి అతని సుదర్శనచక్రంతోనే శిరచ్ఛేదం చేసి ఆర్యావర్తానికంతటికీ ఏకైక వాసుదేవునిగా కావాలని నీచమైన, నికృష్టమైన ఆలోచన చేశాను."

అలా అంటూ అశ్వత్థామ తన దృష్టి నడినెత్తిపైన తీక్షణంగా ప్రకాశిస్తున్న సూర్యునిపైన నిలిపాడు... ఆర్యావర్తంలోని ఐశ్వర్యం అంతా అప్పట్లో ఇంద్రప్రస్థంలోని రాజసభలో ఏకత్రితమైఉంది. యుధిష్ఠిర మహారాజు చేసే రాజసూయానికి మంగళాచరణం జరగబోతోంది. భీష్ముడు, ద్రోణుడు, దుర్యోధనుడు, కర్ణుడు, కృపాచార్యుడు మొదలైనవారంతా హస్తినాపురంనుంచి తరలివచ్చారు. ఇటు కృష్ణుడు, ద్రుపదుడు,ఇంకా శిశుపాలుడు వంటి మహాయోధులు తమ తమ స్థానాలలో ఉపస్థితులై ఉన్నారు.

"పితామహా!" ధర్మజుడు వయోవృద్ధుడు, జ్ఞానవృద్ధుడు అయి భీష్మునికి సవినయంగా ప్రణామం చేసి, "యజ్ఞం శుభారంభం కాబోతున్నది. ఇక్కడకు విచ్చేసిన మహానుభావులలో నేను ఎవరిని ప్రథమంగా సత్కరించాలి? ఆదేశించండి! మీ ఆదేశ ప్రకారం నడుచుకుంటాను." అని అడిగాడు. భీష్ముడు అక్కడ ఉపస్థితులైన వారివైపు ఒకసారి దృష్టి సారించి మందహాసం చేసి "వత్సా! సమస్త ఆర్యావర్తంలో కృష్ణుడొక్కడే సర్వప్రథమంగా అర్ఘ్యానికి అధికారి. ఇందులో సందేహానికికాని,వివాదానికికాని తావే లేదు. నీవు కృష్ణునికి ముందుగా అర్ఘ్యపూజ చేసి నీ ధర్మాన్ని నిర్వర్తించు" అన్నాడు. యుధిష్ఠిరుడు లేచి నుంచున్నాడు. సత్కారం చేయటానికి వలసిన బంగారు పళ్ళెరంలో పూజ సామాగ్రిని తీసికొని ఒక సేవకుడు అనుసరించాడు.

"ధర్మజా!ఆగాగు!" బిగ్గరగా అరిచాడు. రాజుల మధ్యలో కూర్చున్న శిశుపాలుడు వెంటనే లేచి నుంచొని. అందరూ అతనివైపు చూశారు. "ఆర్యావర్తంలో అగ్రపూజకు అర్హుడు కృష్ణుడు అని చెప్పి భీష్ముడు ధర్మాన్ని, న్యాయమర్యాదను

ఉల్లంఘించాడు."ఈ కృష్ణుడు రాజు కాడు. అతడు గొల్లవాడు మాత్రమే. ఆవులను, పశువులను మేపుతూ జీవితం గడిపిన వ్యక్తి ప్రథమపూజకు ఎలా అర్హుడు అవుతాడు? ఇది అధర్మం" అని శిశుపాలుడు ఉచ్చైస్వరంతో అభ్యంతరం తెలిపాడు.

ఇంతవరకు శిశుపాలుడిని చూస్తున్నవారి దృష్టి ఇప్పుడు కృష్ణునివైపు తిరిగింది. కృష్ణునిలో ప్రతిస్పందన లేదు. అతడు శిశుపాలుడినే చూస్తున్నాడు... తనను గురించి కాక వేరే ఎవరో వ్యక్తిని గురించి మాట్లాడుతున్నట్లుగా కృష్ణుడు ఎంతో నిర్మలంగా ఉన్నాడు. ప్రశాంతత అతనిముఖంలో ఉట్టి పడుతోంది. కృష్ణుడు ఎక్కడో దూరంనుంచి వచ్చే శబ్దాలను వింటున్నాడు...

"... కృష్ణుని తండ్రి వసుదేవుడు, స్వయంగా భీష్ముడు ఇక్కడ ఉన్నారు. ఈ వయోవృద్ధులు ఉండగా ప్రథమంగా శ్రీకృష్ణుడు అర్ఘ్యాన్ని స్వీకరించాలని ఎవరు చెప్పారు? ఎలాచెప్పారు? మరి ఈకృష్ణుడు... ఇతడు ఏమాత్రమైన సంకోచమూ లేకుండా ఎలా ముందుకు వచ్చాడు? ఎంచ నీచం?" ...శిశుపాలుని ఈరోజు ఆపేవాడ్వెడూ లేడు. .. "దుర్యోధన మహారాజు,మహాబాహువు కర్ణుడు ఇక్కడ విద్యమానులై ఉన్నారు. వారికి ఇది ఘోర అవమానము. కులగురువైన కృపాచార్యుడు, ప్రతిభావంతుడైన ద్రోణాచార్యుడు వంటి వారిని నిర్లక్ష్యం చేయటంకన్న ఇంకొక అన్యాయం ఉండదు. శ్రీవ్యాసభగవానుడు ఈయజ్ఞకార్యాన్ని సంపన్నం చేయటానికి యజ్ఞకర్తగా వేంచేసిఉన్నాడు. ఆయన సముఖంలో ఆయనను విడిచి ధర్మరాజు కృష్ణుణ్ణి సత్కరించటం నీచాతినీచం!"

సభలో ఒక్కసారిగా నిశ్శబ్దం అలముకుంది. శిశుపాలుని స్వరం దశదిశలా మార్మోగింది. "...గోకులంలో ఉంటూ పరస్త్రీలతో ఇతడు రాసలీలలు చేశాడు... జరాసంధుని వంటి సమర్థవంతుడైన సామ్రాట్‌ను అధర్మంగా మట్టు పెట్టాడు..."శిశుపాలుని క్రోధం అవధులు లేకుండాపోయింది. " పరాయిస్త్రీలను అపహరించి వారిని తనవారిగా చేసుకున్న ఈ కృష్ణుడు..."

కృష్ణుని పెదిమలపై మందహాసం మరింతగా విరిసింది. శిశుపాలుని సంకేతం రుక్మిణిని దృష్టిలో పెట్టుకొని! రుక్మిణి సహోదరుడైన రుక్మితన చెల్లెలు రుక్మిణిని తనకుఇచ్చి వివాహం జరిపిస్తానని వాగ్దానం చేశాడు. కాని రుక్మిణికిఈ సంబంధం ఇష్టం లేదు. ఆమే స్వయంగా కృష్ణునికి సందేశం పంపి ఈ వివాహ సంబంధం తప్పించి తనను చేపట్టమని ప్రార్థించింది. ఈ విషయం శిశుపాలునికి తెలియదు. కాని కృష్ణుడు అనభిజ్ఞుడు కాదుగా! కృష్ణుడు విదర్భకు వచ్చి, తమ కులదేవతకు నమస్కరించి బయటకు వచ్చిన రుక్మిణికి చేయి అందించి రథంమీద కూర్చుండ బెట్టుకొని రథాన్ని ద్వారకవైపుకు తోలించాడు. అడ్డువచ్చిన శిశుపాలాదులను,రుక్మిని ఓడించి రుక్మిణిని తనతోతీసుకుపోయి గాంధర్వ

వివాహం చేసికొన్నాడు. శిశుపాలుడు పరాయి స్త్రీలను అని సంకేతించటంలో అర్థం అదే... అందుకే కృష్ణుని మందహాసం మరింత మధురంగా అయింది...

"...అటువంటి కృష్ణునకు... ఈ గొల్లవానికి అగ్రపూజ పొందే అధికారం ఎక్కడిది? అయినాసరే ఒకవేళ అతనికి అగ్రపూజ చేస్తే అది ఒక నపుంసకునితో స్వర్గలోకంలోని అప్సరకు వివాహం చెయ్యటం అంతటి నీచకార్యం!''అని శిశుపాలుడు ఉచ్ఛైస్వరంతో నిందా వాక్యాలు ఆడాడు. శిశుపాలునికి కాలం సమీపించింది. ఇచ్చిన వరంవల్ల ఇంతవరకు శిశుపాలుడు ఎంత నిందించినా కృష్ణుడు అతడిని క్షమించాడు. శిశుపాలుడు హద్దుమీరిపోయాడు.

"శిశుపాల్!' కృష్ణుడు తన ఆసనం మీదనుంచి లేచినుంచున్నాడు. అతని గంభీర స్వరం ఎంతో ఎత్తైన పర్వత శిఖరంపైనుండి చేసిన శంఖధ్వనిలాగా నలువైపుల ప్రతిధ్వనించింది. "ఈ మంగళకరమైన ఘడియలలో శక్తి సామర్థ్యాలను పరీక్షించు కోవటం సరి కాదు. అయినా నీవు చెప్పింది సత్యమో కాదో దానిని నిరూపించుకోవటానికి ఇదిగో నీకు ఒక అవకాశం ఇస్తున్నాను! ఈ సుదర్శన చక్రాన్ని ఎదుర్కొని నువ్వు అగ్రపూజాధికారము సంపాదించుకోవచ్చు!''

అందరూ విస్ఫారిత నేత్రాలతో చూస్తూఉండగా సుదర్శనాయుధం కృష్ణుని కుడి చేయి చిటికినవేలి పై కోటిసూర్యప్రభలను తలతన్నుతూ మెరుస్తూవచ్చి నిలచింది. కన్నుమూసి తెరిచేటంతలో ఆ చక్రం తీవ్రగతితో శిశుపాలునివైపు దూసుకువెళ్ళింది. శిశుపాలుడు కూడా శ్రీకృష్ణుని రుద్రరూపంచూసి హతప్రతిభుడైనాడు.. ఒక్క తృటిలో ఆ సుదర్శన చక్రం శిశుపాలుని శిరస్సును ఖండించి తిరిగి శ్రీకృష్ణుని తర్జనిపైన నిలచింది...అందరూ ఆశ్చర్యపోయి చూస్తుండగా ఒక వెలుగు కిరణంశిశుపాలుని కళేబరంనుండి బయటకు వచ్చి శ్రీకృష్ణునిలో లయించిపోయింది. ఒక్కక్షణం ముందు భయభీతులై విభ్రాంతులైన రాజలోకం చేసిన జయ జయ ధ్వానాలతో నిండి సభామండపమంతా మార్మోగింది. "నేను ఈ దృశ్యాన్ని విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నాను. కృష్ణుని సుదర్శన చక్రంతో భయభీతమైన రాజసభ!... నామనస్సులో ఏదో స్ఫురించింది. నాలో ఏవో విపరీతమైన భావాలు మొలకెత్తాయి'' అన్నాడు అశ్వత్థామ.

- సశేషం

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,